శ్రీరస్తు.

—:০:—

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీమదఖిలమహీమండలమండనాయమానంబగు,

శ్రీకాళహస్తిలోచేరిన

మద్దులేట్పురం గ్రామనివాసస్తుండును

జంగం - వీరరాఘవశెట్టినామధేయదాసపుత్రుండునగు,

శేషదాసబాలకవివరునిచే,

రచియింపఁబడిన

# శ్రీరుక్మిణీకల్యాణచరిత్రసంకీర్తనలు.

Rukmini Kalyana Charitra -

ఇయ్యవి

పండితోత్తమపరిష్కృతంబై

వే॥ వేంకటసుబ్బాశాస్త్రులవారి స్వకీయ,

సరస్వతీవిలాసముద్రాక్షరశాలయందు

మ॥రా॥రా॥శ్రీ, వఁకాయల - కృష్ణస్వామిశెట్టివారి

ప్రేరణవలన

సదరు- గ్రంథకర్తచే ముద్రింపించి ప్రచురింపఁబడెను.

౧౮౯౨-సం॥ జనవరినెల.

దీనిక్రయం - రూ, ౦—౪—౦,



శ్రీ ర స్తు.

శ్రీరుక్మిణీసమేత శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః

## శ్రీ రు క్మి ణీ క ల్యా ణ సం కీ ర్త న ము లు.

### వి నా య క ప్రా ర్థ న ము.

శ్లోకం॥ శుక్లాంబరధరంవిష్ణుం - శశివర్ణంచతుర్భుజం। ... ...
ప్రసన్నవదనంధ్యాయే - త్సర్వవిఘ్నోపశాంతయే। ...
అగజాననపద్మార్కం- గజాననమహర్నిశం। ... ...
అనేకదంతంభక్తానా మేకదంతముపాస్మహే॥ ... ...

:౦:-

యమునాకల్యాణి రాగము - ఏకతాళము.

పల్లవి.

విఘ్నరాజదేవా . నగజో[illegible]వరావా

## అనుపల్లవి.

కుందరదనసుందరాంగి - చందనగంధిరో భగవతి॥(వంద)

## చరణములు.

ఇందువదనమృదుభాషిణి ఏణాక్షితలోదరినా
డెందమునసుభజియించెద మందహాసినీమదవతి॥ (వంద)

నీలవేణినినుమది - నిక్కముగసునమ్మితి

చాలగనీదయనేలుము జాలముసేయకవేగమె
వాలాయముమీరగనా వాకుఁనవసియింపుమమ్మ॥(వంద)

సన్నుతినేజేసెద - సరసిజాక్షిశారద

ఎన్నోవిధములవేడెద వీణాపుస్తకపాణిరో
పన్నుగనీదయనేలుము పరమపావని శ్రీవాణి॥ (వంద)

వరములనాకొసగుమీ - ఒనరుగనిదివినుసుమీ

ధరలోవెలసినమద్దులే ట్పురహరియంకితముగనీ
చరితముచెప్పగబూనితి నిరతముసరిజేయుజనని॥(వంద)

—:*:—

## సాక్షాద్భగవంతుండగు శ్రీమన్నారాయణమూర్తి ప్రార్థనము.

—:o:—

శా॥ శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్థల
శ్రీవిభ్రాజితునీలవర్ణుఁ శుభరాజీవాక్షుఁ కంజాత భూ
జేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజునచ్యుతుఁగృపావాసుంబ్రశంసించెదన్॥

—:::—

## నాటరాగము - జంపె తాళము.

జయరుక్మిణీలోల జయమదనగోపాలం
జయసద్గుణశీల జయకనకచేలా॥ (౧)

జయభక్తభవహరణ జయగోపికారమణ
జయరుద్రనుతచరణ జయకృపాభరణా॥ (౨)

జయసకలమునితోష జయదీనజనపోష
జయసుధారసభాష జయదురితశోషా॥ (౩)

జయయసురకులభీమ జయనీరదశ్యామ
జయశేషనుతనామ జయపరంధామా॥జయ॥ (౪)

——:o:——

## లక్ష్మీ దేవి ప్రార్థనము.

——:o:——

మ॥ హరికిం బట్టపురాణివై పెన్నిమలబోవర్ధంపు పెన్నికరాచం।
గురుతో బుట్టువు భారతీగిరిసుతల్తో నాడుపూబోడి తా।
మరలందుండెడు ముద్దరాలు జగముల్మన్నించుసిల్లాలు భా।
సురతన్ లేములువాపుతల్లి శిరియిచ్చున్ నిత్యకల్యాణముల్॥

——:o:——

కీర్తన—బ్యాగ్ రాగము - రూపక తాళము.

పల్లవి.

మన్ననసేలవమ్మ - మారునిజనని॥ మన్నన॥

అనుపల్లవి.

ఎన్నోవిధములస - సన్నుతిజేతును
కన్నడజేయుకు - కరుణించుమోతల్లి॥ మన్న॥

చరణములు.

క్షీరవారధిసుత నేరమెన్నకనాకు
ఘోరదురితములం బారగదోలుము॥ మన్న॥

వాసవవందిత భాసురాంగినను
మోసముసేయకు వాసుదేవునిరాణి॥ మన్న॥

ధరలోనమద్దులే ట్పురిని వెలయుహరి
యురమునవసియించి మెరయురమాదేవి॥ మన్న॥

—:o:—

వ॥ అని యివ్విధంబున యిష్టదేవతల ప్రార్థనంబు గావించి తదనంతరంబు॥... ... ... ... ...*

—:o:—

## పూర్వఋషిగణ భాగవతోత్తములప్రార్థనము.

క॥ వ్యాసవసిష్ఠపరాశర । భాసురశుకశౌనకాదిభవ్యఋషులనుఁ ।
వాసిగబలిప్రహ్లాదవి । భీషణరుక్మాంగదాంబరీషులగొలుతుఁ॥

క॥ అనియిష్టదేవతలమది ।
ననయముప్రార్థించిఋషుల ।
నవనీసురులఁ । వినుతించెదవంశక్రమ ।
మును దెలిపెదభక్తవర్యముఖ్యులు మెచ్చఁ॥

—:o:—

## కవివిచారము - ద్విపద.

శ్రీకరంబుగధర-చెలువుగావెలయు - శ్రీకాళహస్తికిఁజెంతననుండు* పొలుపొందమద్దులేట్పురమందిరమున- వెలసినవేంకటవిఠలునికరుణ * చెలువొందగాజుల - సెట్లవంశమున * వలనొప్పగాపాలవల్లిగోత్రంబు * విష్ణుమతంబనవెలయుచుధరను - శ్రేష్ఠమైయొప్పునుజనులలో నెపుడు * జంగమవాండ్లనజగతిలోమిగుల- రంగుగాగృహపేరురంజిల్లుచుండు * యిట్టివంశంబునవెలయునుకీర్తి-శ్రేష్ఠుడైచెంచమశెట్టినామమున * నతనికినేవురునందనుల్గలరు- మతిమంతులగుచుయిమ్మహిని కెక్కి-* తెరగొప్పవార్ల - ద్వి

తీయపుత్రుండు- గురుతరంబైనస ద్గుణగరిష్ఠుండు* తేజంబునెన్నగా దీనక
రుపగిది - రాజసంబునసుర రాజసముండు* పరధనపరదార - పరులనిం
దలను - విరివిగామదినెప్పుడెఱుఁగనివాడు * ధర్మగుణంబులదనరినవాడు-
నిర్మలశాంతుండునీతికోవిదుఁడు *కమలనాభునికరుణగలిగినవాడు - ప్రమ
దంబుతోడుతప్రబలినవాడు * కరమర్థివీరరాఘవశెట్టిపేర - మెరయుచు
నుండుగు మేదినిలోన * యతనికిలక్ష్మమ్మయనుకాంతసతియు - పతివ్రతనడవ
డిభాసిల్లుసుగుణ * పతినిదైవంబనిభావించుమదిని - సతతంబుపూజలసలుపు
చుధరను* చెలగునవీర్లకు జ్యేష్ఠపుత్రుండ- సలలితంబుగను శేషయ్యనామము
న * విలసితంబగుచుండువిబుధులుమెచ్చ*నిలనుబాలకుడనై -వెలయుదునిపు
డు*పదునెనిమిదియేండ్లప్రాయంపువాడ - విదితగుణంబులవిధినేనెరుంగ*
సకలపురాణశాస్త్రములనెఱుంగ - ప్రకటితంబగుకావ్యభావనమెఱుగ *
అమరత్రికాండము - లరయనివాడ-గమకించఛందస్సుక్రమమెరుంగకను* మ
హైదతంత్రియామహితగుణుండు - సత్పుణ్యుడగుమరి - సచ్చరిత్రుండు *
ఆశ్రనెరింగిన అనుభవపరుడు - సాత్వికగుణమున * సకలశాస్త్రముల*
సారమెరింగినసజ్జననుతుడు - సారసాక్షునిభక్తిసలిపెడుఘనుడు* గరిమతో
సుబ్బయ్యగారినామమున - ధరలోనవిలసిల్లు- ధన్యతమెరసి * కరమర్థియా
తనికరుణచేనిపుడు - పరగంగయతిగణప్రాసముద్దెలిసి * బహువడిరుక్మిణీప
రిణయంబనెడు - చరితంబుజెప్పంగసంతసంబొదవి * తప్పకమదినిశ్రీధవుని
దర్శించి - చెప్పబూనితినయ్య - శ్రీహరిదయను* యొప్పగాసత్కృపల్ యొ
నరసికృతిని - తప్పులుసవరించిదయజూడుడనుచు * చెచ్చెర వేడెదశరణని
మిగుల - మెచ్చుదీవెనలునాకొసగంగవలయు॥ ... ...*

——:o:——

బు ధ జ న స్తు తి.

యమునాకల్యాణిరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

శరణుశరణు - సాధులార - కరుణజూడరయ్యామీరు॥ శరణు

# శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

## అనుపల్లవి.

పరమపుణ్యులగుటనుమిము - పలుతెరగులప్రార్థించెద
ఇరువొందగసకలార్థకము - లెరుగనియల్పకుడనయ్యా
(ద్రుత)మరియునుపదునైనిమిదివ - త్సరములలో వెలయువాడ
నిరతమునన్నేలుమనుచు - నెరనమ్మితిశుభకరముగ॥ (శరణు)

యతిగణప్రాసంబులనే - యరయనిబాలకుడనునీ
క్షితివెలసినమద్దులేట్పురి - శ్రీశునికరుణను జేసియు
అతులితమగునీచరితము - అనువొందగరచియించెద
హితమతితోడనుమీదయ - నెంచిబ్రోవమనుచుదలతు॥ (శరణు)

—:o:—

## సీసపద్యము.

వినరయ్యబుధులార విన్నవించెదనాదు । మనవినిమీమది ఘనతజేసి నాయొనరించునీ నారాయణునిచరిత్రమునదోషములున్న । సమముజేయ గనుభాగవతమున. గలపద్యవచనము । లందందుజేర్చిన సరిసొనుగు । మనుచుమనంబెంచిమాధవుస్మరియించి । మొదలుపెట్టెదముదమునను గాన । బాలకుండనుజేసెద చాలవినుతి । కీరభాషణములకెట్లు కోరిమిగుల । సంతసంబందెదరోనట్లు సరమీర । దలచిననుగౌరవించుడిధన్యులారా॥ ✽

-౧౨-

వ॥ ఇవ్విధంబున సత్కవీంద్ర సాధుజనంబులకుం బ్రణమిల్లి శ్రీమన్నారాయణార్పితంబుగా నాయొనర్పంబూనిన శ్రీరుక్మిణీకల్యాణచరితంబగుసంకీర్తనములకుం గథాక్రమంబెట్టిదనిన॥ ✽



శ్రీ ర స్తు.

—:o:—

# శ్రీ రుక్మిణీ కల్యాణ చరిత్రము.

కాలక్షేపమునకు యోగ్యత కలిగిన సంకీర్తనములు

శ్రీరుక్మిణీసమేత గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.

శ్రీకరకరుణాసాగర ప్రాకటలక్ష్మీ కళత్ర భవ్యచరిత్రా
లోకాతీతగుణాశ్రయ గోకులవిస్తారనంద గోపకుమారా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండయినసూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె॥ ❊

## తోహరా చరణములు.

ప్రతితోహరాలకున్ను యీదిగువవ్రాయబడిన చరణమును
పల్లవిగాపాడవలయును.

మంగళమగుశ్రీరుక్మిణీపరిణయ - మనునీచరితముభువిలోన॥
పొంగుచువినువారికినెల్లప్పుడు-పొలుపగుశ్రీహరిపురిలోన॥
ఖగపతియింద్రునిగెలచియసుధముగ-గైకొనినచందమునను
జగతీనాథులచైద్యకుశసాళ్వాదులంజయించియును॥ మంగళ॥౧॥

ఇభ్భువిలో విదర్భపురమునను వెలసినభీష్మకుపుత్రిక్
గొబ్బున నెత్తుకచనియెను ప్రేమను గోపాలుడు నాపడతిక్ ॥మంగ॥ ౨॥

-:o:-

వ॥ ఓపరీక్షిన్నరేంద్రా మున్ను వినతకొమారుండగు గరుత్మంతుండే విధంబున దేవేంద్రునిజయించి యమృతంబునుంగైకొనియెనో ఆప్రకారంబుననే సాక్షాత్ భగవంతుండగు శ్రీకృష్ణుండు శిశుపాలజరాసంధదంతవక్త్ర సాళ్వాదులాదిగాగల జగతీనాథులజయించి విదర్భాధీశుండగు భీష్మకరాజకూతురగు రుక్మిణీదేవినింగొనివచ్చి వివాహంబుజేసికొనియెనని చెప్ప శుకయోగీంద్రుంగని పరీక్షిన్నరేంద్రుండడిగె నెట్లనిన॥ *

—:o:—

తోహరా॥ ఇట్టుల శుకమునియు మెరుగబలుకగను వినియున్నృపతియిట్లనియెన్।
పటుతరముగ రాక్షసపరిణయమున పరమపురుషుడరిగియును॥ ౩॥
మంచగమనయగు మహిలో భీష్మకు సుందరసుతరుక్మిణినూ।
అందముగా శ్రీకృష్ణుండెత్తుకన తనిపురముచనుటకునూ॥ మంగ॥ ౪॥
వచ్చినదొక్కడె యెటుల జయించెను వనజాక్షుండసురులముల్।
మెచ్చగసురులును బొగడగ వెలదిని యెటుల చేకొనెను చెపుముల్॥ ౫॥
యవనివిభుండిట్టులనియు మరియునూ యాశుకమునితోననియెన్।
వివరముగను నీకథ దెల్పుము నేవినగోరెదననిమరియున్॥ మంగళ॥ ౬॥

—:o:—

వ॥ ఓ శుకమునీంద్రా మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకువచ్చినహరి రుక్మిణీదేవింగొనిపోయెనని పలికితివి శ్రీకృష్ణుండొక్కరుండెవ్విధంబున శిశుపాలజరాసంధ దంతవక్త్ర సాళ్వాదులాదిగాగలనేకరాజులంజయించె నేలాగునయారుక్మిణింగొనివచ్చె నది మహాశ్చర్యకరంబగుంగాన నాకెరింగింపుండని పరీక్షిన్నరేంద్రుండు మఱలనిట్లనియె॥

—:o:—

శా॥ కల్యాణాత్మకమైనవిష్ణుకథలాకర్ణించుచున్నుక్తుడౌ।
కల్యుండెవ్వఁడుత్పృప్తుడౌ నవివినంగాగోత్రితలౌచుండు సా
కల్యంబేర్పడ భూసురోత్తమమెరుంగంబలుకు-వే రుక్మిణీ
కల్యాణంబువినంగనాకుమదిలో గౌతూహలంబయ్యెడిన్॥

వ॥ మఱియును॥

—:౦:—

కీర్తనము-కాంభోదిరాగము- అటతాళచాపుతాళము.

పల్లవి.

శ్రీరుక్మిణీకల్యాణంబు - బహు - చెలువువెలయువైభవంబూ

అనుపల్లవి.

ధారుణిలోగల క్రూరపుజనులకు
ఘోరపాపముల గూల్చివేయునట్టి
(ద్రుత) పారమగునౌషధము-మీవలె- సాధులనగనుసెరుగబడితిని
గోరియడిగెదగాన- మది- విచారమును వేగమునదీర్చుము॥ శ్రీరు॥

భూషణంబులుచెవులకు-బుధ-తోషణంబులుగానగూ
దూషణాదిక్రోధ లేశమయినలేక
గ్రోసివేసినట్టి గుణులుమీకుగాక
వాశిగనుధరమద్దులేట్పురి యీశుడైనెలకొన్నకృష్ణుని
భాసురంబగుకథలువిన-నా-భాగ్యమనవగువిన్నవింపుము॥ శ్రీరు॥

-:౦:-

వ॥ -మఱియును శ్రీహరిచరిత్రంబులందలప ఘోరంబగు పాతకముల
హరించునట్టి నౌషధంబై యొప్పునట్లు మిముంబోలు మహనీయులనంగవినం
బడితిగాన యాహరిచరిత్రంబులన్వినవలయునని నాదుమనంబున మిగుల సం
తోషంబగుచు నుటంజేసి ఈ నాయందుంగరుణనుంచి శ్రవణానందకరంబు

గ శ్రీహరికథలం జెప్పి నను గృతార్థుంగావింపుండనియడిగిన పరీక్షిన్నరేం
ద్రునకు అత్యంతసంతోషచిత్తుండగుచు శుకయోగీంద్రుండు చెప్పందొడంగె॥

-:o:-

## —() కథా ప్రారంభము. ()—

పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు దెలుపుట.

తోహరా॥ వినుము విదర్భాదేశం బేలెడు - వీరుడయిన భీష్మకుడూ
ఘనతమీరగను నైదుగురుసుతులను - క్రమముగ వడసెను నతడు॥ ౭
నైదుగురకుం గడగొట్టు చెల్లెలై - నెలత యొకటియుదయించెన్
నావనితకు రుక్మిణియను నామము - నయముగ భీష్మకుడునిచెన్॥ ౮॥

—:o:—

వ॥ ఓ పరీక్షిన్నరేంద్రా విదర్భదేశంబున కుండినపురంబను నొక్క పురంబుగలదు యాపురంబేలు భీష్మకరాజునకు అయిదుగురుకొడుకులుగలిగిరి వారలకుం గడపట నొక్క కూతురుం గలిగె నబ్బాలికామణికి రుక్మిణియను నామంబిడిరి యంతనబ్బాలికయు॥ ※

క॥ బాలేందురేఖ దోచిన। లాలితయగు నపరదిక్కులాగున ధరణీ।
పాలుని గేహము మెరసెను। బాలిక జన్మించి మొదుగ భాసురమగుచున్॥

వ॥ ఇట్లు శుక్లపక్షమందుదయించు చంద్రుండే విధంబున దినదినంబునకుం గళలెచ్చుచుండునో నవ్విధంబున నబ్బాలికయు భీష్మకరాజగృహంబున విలసిల్లుచుండె మరియు దినదినప్రవర్ధమానయై॥ ※

—:o:—

తోహరా॥ అంతట నాకాంతామణి బొమ్మల - కతిప్రేమముతో మెరయన్
సంతసంబుగను కల్యాణంబుల - సలుపుచునుండెను మరియున్॥ మం॥ ౯॥
కొంతకాలమున కావనితయు - గుజ్జనకూళ్లొండుచునుండెన్
కాంతలకును కొంతయు పెటుచు - మరికొంత యూతను దినుచుండెన్॥ ౧౦

రమణీయంబగుపూలవనమునను- రమణులతోఁగూడుకయుఁ
భ్రమమీరఁగనాపుష్పలతలకును - బోదులుసేయుచుమరియుఁ||
సదమలమణిమయసౌధభాగముల- సంతసముగనతివేగఁ
ముదితలగూడుకభర్మడోలికల-ముచ్చటలాడుచునూగుఁ|| మం||
బాలికామణులచేరియాసఖియ - బంతులనాడుచుమరియుఁ
మేలిమిమీరగచిలుకకోవెలల- మెలగిపలుకుచును వెలయుఁ||౧౩||

-:о:-

వ|| ఇవ్విధంబున రుక్మిణీదేవి చిన్నవయసునం జేసి చెలులంగూడి బొమ్మలకుం బెండ్లిండ్లు సేయుటయు గుజ్జనగూళ్లొండుటయు చెలులుం దానుం భుజించుటయు అత్యంతరమణీయంబగు నగరులయందలి బంగరువుయ్యాలల నూగుటయు యాచెలులతోడ పూలచెండ్లాడుటయు చిలుకలంగోవెలలం భాషించుటయును మొదలగు ననేకవిధంబుల యుత్సాహంబునం గూడియుండె మరియును||

—( చెలులంగూడి యొకరికొకరు యుత్సాహంబున బలుకుట. )—

బంతులాడుపాట - కల్యాణిరాగము- ఆదితాళము,

పల్లవి.

బంతులనాడెదము వేగ పంకజాక్షులార రారె||బంతులనా||

అనుపల్లవి.

చింతనములవదలియు - బహు - చెలువుగగుమిగూడియు శ్రీ
కాంతునిమనమునదలచుచు శాంతులమగుచును-మోదమున
(ద్రుత) సంతసముగవెలయుహేమ కంతుకములకరములనిడి
పంతములాడుచును వేటక పలుతెరగులభాషింపుచు||బం||౧||

| | |
|---|---|
| శృంగారవనంబుననతి | పొంపుగదిరుగుచుశుకపికి |
| భృంగిగణరవముల యు | ప్పొంగుచుయానందింపుచు |
| రంగుగధరశేషయ్యను | రక్షించినకేశవుబహు |
| భంగులధ్యానముజేసిన | మంగళకరమగునిజముగ॥బం॥ ౨॥ |

వ॥ మఱియునుం గొబ్బిపాడిరట్లంటేని॥ *

——:o:——

రాగము - యేకతాళము.

గొబ్బియళ్లో॥ కమలాక్షులారారారేశ్రీ - కాంతునిసేవింతము॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥ రమణులారావినగేమునుకరి - రాజునుదయనేలెనే॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥భాసూరాంగుడగునేకొమ్మ - భక్తవత్సలుడమ్మ॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥ఆశాచేభజియించినాబహు - వాశిగలుగునంమ॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥పొంగుదుపుష్పములాపొందు - రంగనిపూజింతమె॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥అంగజజనకుడుమనల - ఆదారించిబ్రోచునే॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥ధరమద్దూతేట్పురినివెలయు - దాసావరదుడమ్మా॥ గొబ్బి॥
గొబ్బియళ్లో॥శిరులానొసగిశేషయ్యాను - చెలువుగరక్షించెనే॥ గొబ్బి॥

వ॥ అనియిట్లు గొబ్బిబాడిరయ్యవసరమున॥ *

——:o:——

సీ ॥ దేవకీసుతుకోర్కె తీగెలుపీడంగ వెలదికిమైదీగె వీడదొడగె । కమలనాభునిచిత్త కమలంబువికసింప కాంతినింతికిముఖకమలమొప్పె । మధువిరోధికిలోన మదనాగ్నిపొడసూపc బాలతికిచనుదోయిపొడవుసూపె । శౌరికిధైర్యంబు సన్నమైడాయంగ జలజాక్షిమధ్యంబుసన్నమయ్యె । హరికిప్రేమబంధ మధికంబుగాగేశ బంధమధికమగు బాలకమరె । పద్మనయనువలన ప్రమదంబునిండార నెలతకెవ్వనంబునిండియుండె॥ *

వ॥ ఇట్లురుక్మి-రుక్మిరథ - రుక్మిబాహురుక్మికేశ-రుక్మినేత్రులను-నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి దనయవ్వనప్రాయంబునా॥ *

కీర్తనము-కల్యాణి రాగము-ఆదితాళము.

### ప ల్ల వి.

రాజేంద్రవినుమయీ రాజితమగుకథ రమ్యమనోహరము.

### అ ను ప ల్ల వి.

రాజితంబగు రాజగృహమున రమ్యముగనే తెంచుభటులచే॥
తేజముగు నా రామకృష్ణుల తెలివివినిరుక్మిణియుదలచెను॥ రాజేం॥

### చ ర ణ ము లు.

సయ్యారువరిలోన నాశ్రీకృష్ణుడెసరి నాథుండగుననుచునూ॥
నెయ్యముగ నాయుణివ నెంచగ నెలతరూపగుణాతిశయముల॥
చయ్యనను కృష్ణుండువినితన సఖియగాచేకొనగదలచెను॥ రాజేం॥

అంతబంధువులెల్ల ఆనందముగ చేరి అబల శ్రీకృష్ణునకు॥
సంతసంబుగ నిత్తమనగను సకలకోపధము పెంచిరుక్మడు॥
నంశకృష్ణునకివ్వననుచును నంధు శైశుపాలునకునని॥ రాజేం॥

పౌరుషంబుతోడ పంతమాడినఅన్న పలుకులప్పడతివినియూ॥
ధారుణినిమద్దులేటిపురమున దాసులనుపోషింపుచుండెడి॥
సారసాక్షునకు దెలుపవేగమె సఖియపిలువగనంపెవిప్రుని॥ రాజేం॥



వ॥ ఓనరేంద్రా ఆసమయంబున రుక్మిణిదేవి తసదుతంత్రియా భీష్మకరాజగృహంబున కరుగుదెంచుచుండు భటజనంబులవల్లను బలరామకృష్ణుల సౌందర్యగుణాతిశయంబులవిని ॥ యందు శ్రీకృష్ణుని వివాహంబు జేసికొనవలయునిదితథ్యంబని తావరించె ॥ నంతయారుక్మిణీదేవి రూపసౌందర్యాదిగుణాతిశయముల నాకృష్ణుండెరింగి యబ్బాలికామణినిందనకు భార్యగాచేకొనవలయునని దలంచె॥ ॥

అయ్యవసరంబున భీష్మకరాజుంగల బంధువులందరుంగూడియబ్బాలికామణినింగృష్ణునకొసంగుటసమ్మతంబని దలంచుటంగని, యాభీష్మకరాజజ్యేష్ఠపుత్రుండగు రుక్మియనుదుష్టుండు శ్రీకృష్ణునిపైననేకవిరోధంబులంజేసి తనదుబంధువర్గంబాడిన పలుకులనటంకంబుజేసి తనచెలియలిశిశుపాలునకిత్తునని మూఢుండగుచువచించె॥ ❋

ఇవ్విధంబునతన్ను శిశుపాలునకివ్వందలంచిన యన్నపలుకులన్నానియెరింగి తనమనంబునవ్యసనంబవలంబించి తనకాప్తుండగు నొకబ్రాహ్మణునిం బిలువంబంచి యాశ్రీకృష్ణునకివ్విధంబెల్ల నెరింగింపందలంచి॥ ❋

గీ॥ అంతశ్రీరుక్మిణీదేవి యార్యుడయిన భూసురోత్తమురప్పించి పొంకముగను । తనదువృత్తాంతమంతయుతరుణివేగ చెప్పదొడగెను నంతటచెలువుమీర॥

వ॥ ఇట్లుబ్రాహ్మణురావించి రుక్మిణీదేవి తన వృత్తాంతంబంతయు నావిప్రునకుంజెప్పందొడంగె॥ ❋

(శ్రీరుక్మిణీదేవి తనమనంబునంగలకోర్కెల భూసురునకెరింగించుట.)

కీర్తన—యమన్ రాగము - త్రిపుటతాళము.

ప ల్ల వి.

యేమనంగవచ్చును    యెటులయోర్చుకొందును
కామజనకునేవరింప    కరుణమాలెనాదుతండ్రి॥ యేమనం॥

అ ను ప ల్ల వి.

వేమరునేనెంచిచూడ    వేణువినోదునకునాపై॥
కామములేదాయనాయిటు    కలుగుటయేకారణమగు॥ యేమ॥

చ ర ణ ము లు.

భూసురేంద్రయిదివిను    పొలుపుగనామదిగను॥

భాసురముగ నాదుమనము ఛావింపక నాజనకుడు॥
తానుతుపలుకులవినినన్ వలచెను చైద్యునికివ్వగ॥ యేమనం॥

యిటులనున్నదిచ్చటా కటకటనాముచ్చటా॥
ఘటికుడవయి ద్వారకపురి కడువడినే తెంచియాధర॥
పటుతరముగ శేషయ్యను పాలించినహరికిదెలువు॥ యేమనం॥

—:౦:—

వ॥ ఓభూసురేంద్రా నాచుమనస్సున శ్రీకృష్ణునివరించియుండుటనించుకయుండలంపక మాతండ్రియా భీష్మకుండు తనకొడుకుపలుకులకొడంబడి నన్ను శిశుపాలునకిచ్చెదనని నిశ్చయించియున్నాడు గనుక మీరాద్వారకానగరంబునకేవిధంబునైనం జనిలోకరక్షకుండగు నయ్యాదవేంద్రునకెరింగించి ననుంగృతార్థంజేయుండని పలికియు మరికొన్ని రహస్యవచనంబుల బోధించె॥ ❀.

—:౦:—

తోహరా॥ అనియివ్విధమున శ్రీరుక్మిణితన - మనమునగలిగినచింత
ఘనుడగువిప్రునికడదెలిపెనుబహు - వినయోక్తులనాకాంత ॥ ౧౪॥
అంతటప్రతిబలికెనువిప్రుండా - యతివకుసంసతమొప్పా
చింతవలదువినుశ్రీహరిదెచ్చెద - చెలియనీమదినిగొప్పా॥ మం॥ ౧౫॥
దలచిసెలవొసగుచనియరుదెంచెద - దనుజమర్ధనునికడకూ
విలసితముగనీవిన్నవించినది - వివరముగనుదెల్పుటకూ॥ మం॥ ౧౬॥
నాదుచతురతనుమెప్పించెదబహు - బోధజేసియిదిజూటా
కాదుమాధవునినీపతిజేసెద - కనుమావలెనామాటా॥ మం॥ ౧౭॥

—:౦:—

వ॥ అనియివ్విధంబున రుక్మిణీదేవి తనమానంబునంగలిగియుండు తలంపును యాభూసురునకుంజెప్పగా నతండుత్సహించి మరలనిట్లనియె॥ ❀ యోతల్లిరుక్మిణీనే ద్వారకానగరంబున కతిత్వరంజనుదెంచి యాకృష్ణునకు మీరు విన్నవింపుమనిన తెరంగెరింగించి అనేకవిధంబులనాదు చాతుర్యవశంబున

నభ్భగవంతుని మెప్పించి * యతనిం బిలచికొనివచ్చెద నావలం జూడు నాదు పలుకులని చెప్పి నీవు దుఃఖంబుమానియుండు మదిగాక నాకు సెలవొసంగు పోయివచ్చెదనని పలికి విప్రుండు మరియు నిట్లనియె॥ *



కీర్తనము — ముఖారి రాగము - ఆది తాళము.

పల్లవి.

పోయీవచ్చెదనమ్మా నేనూ - శ్రీకృష్ణు చేరపోయీవచ్చెద

అనుపల్లవి.

పోయీవచ్చెదనమ్మా పొలతీ రుక్మిణీ నేడూ॥
వేయూవిధములనాతో వెలదీరో దెలుపనేల॥ పోయీ॥

చరణములు.

అల ద్వారకాపురములోన - కొలువై యున్న - జలజాతలోచనునితోన
పొలువుమీరగ నీవు వుత్తెంచినాయట్టి
కలికీరో హరికి నీ కథ లెల్ల దెలుపవేగ॥ పో॥

యేవిధమైన స్వామి యిటకు - వచ్చేటట్టుగ - భావించి చెప్పేటందుకొరకు
తొవ్రతప్పక పోయి ద్వారకపురినున్న
గోవిందు దెచ్చి నీ కోర్కెలుదీర్చు కొరకు॥ పో॥

సరసిజనయన వినవమ్మ - నామాట నిజము - పురుషోత్తముని దెత్తునమ్మ
ధరలోన మద్దులేదు పురమున వెలసిన
కరిరాజవరదుడు నిను కరుణా చేకొనును నిజము॥ పో



వ॥ అని యివ్విధంబున రుక్మిణీదేవికి విన్నవించి యమ్మానినిచే యనుజ్ఞవడసి యావెనుక విప్రుండు (బ్రాహ్మణరాయభారము) *

# శ్రీ రు క్మి ణీ క ల్యా ణ సం కీ ర్త న లు.

శ్రీరుక్మిణీదేవిచేయనుజ్ఞాతుండై-బ్రాహ్మణుండు ద్వారకాపురంబునకరుగుట

క॥ కదువడిచనివిప్రుడుబహునిదుదగువనగిరులగడచినేగియునవలన్।
తడబడుపదములమెల్లన నడుచుచుభీతియునులేక నరిగియునవుడున్॥ *

వ॥ యివ్విధంబునంజనిచని॥

—:౦:—

కీర్తనము—హిందుస్తానికాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

ద్వారకపురిజేరెన్-బహు-త్వరగబ్రాహ్మణోత్తముడే తెంచియు॥ ద్వా

అనుపల్లవి.

కూ గిరులనడచెటి
ధీరుభీష్మకుని
కుండినగరిపుర
కూర్మిసుతబనుప॥ ద్వార॥

చరణములు.

క్షీరసాగరసుత - మైవెలయు - శ్రీరుక్మిణిగరిత
కూరిమితోతన
కోరి-బలుకగని
మీరినసంతస
మెలగుచువిప్రుడు - రీ
ధారుణిముద్దులేడ్
పురవరదుండగు
నీరజాక్షునకు
నేర్పున దెలుపగ॥ ద్వారక॥

వ॥ ఇవ్విధంబున విప్రుండు ద్వారకానగరంబునకుంజని చారులవలన తానువచ్చిన వృత్తాంతంబెరుంగంబంచినవిని సాక్షాత్ భగవంతుండగుశ్రీకృ *
ష్ణుండంత॥

క॥ వచ్చినవిప్రునికెదురుగ యిచ్చగజనితోడితెచ్చి వేడ్కలలరగన్॥
హెచ్చగుసింహాసనమున మెచ్చగగూర్చుండజేసె మేదినినాథా॥ *

వ॥ అంతనావిప్రునకెదురంజని బిలచికొనివచ్చి యత్యంత సంతోషచిత్తుండగుచు నతనికింతగవగు నొకకుర్చియుచితాసనమునం గూర్చుండనియోగించె ననిచెప్పిపరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె॥ *

క॥ అంతటవిప్రునకునుబహు సంతసముగపూజసలుప సరగుననత డుక్ ।కంతుసిజనకునకునుబహు వింతలుగనుదీవెనలనుయిచ్చెనునధిపా॥ *

వ॥ ఆసమయంబున యారుక్మిణీదేవి పంపునంజనుదెంచిన విప్రునకనేకవిధంబులంబూజలు జేసిన యతండును సంతసించియయ్యాదవేంద్రునింగని పెండ్లికొడుకవుగమ్మని దీవించిన ముసిముసినగవులనగుచుచు యుత్సాహంబు నవెలసియుండె * హరియు శ్రీకృష్ణుండు సాక్షాద్భగవంతుండయ్యును యావిప్రోత్తమునిబూజించె ననంగనెట్లనిన నదియెఱింగింతువినుమని పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె॥ *

శ్లోకము॥ దైవాధీనంజగత్సర్వం మంత్రాధీనంతుదైవతం తన్మంత్రం
బ్రాహ్మణాధీనంబ్రాహ్మణోమమదేవతా॥ ... *

వ॥ యీలోకమంతయు దైవాధీనమైయుండును ఆదైవముమంత్రాధీనమైయుండును ఆ మంత్రము బ్రాహ్మణాధీనమైయుంనది కాబట్టి బ్రాహ్మణులునాకుదైవమనియు శ్రీకృష్ణమూర్తి శాస్త్రంబులయందానతిచ్చియున్నాడు గనుక నవ్విధంబుననే యావిప్రునకనేకవిధంబులం దనకు దేవతలుసేయుచందంబునంబూజలుజేసిసరసపదార్థ సంపన్నంబైన యన్నంబుబెట్టించిమరియునవ్విప్రుండు మార్గాయాసంబునంజిక్కియున్నాడనుచు మనంబు నందలంచి లోకరక్షణ ప్రశస్తంబగుతన హస్తంబున నవ్విప్రుని॥ *

—:o:—

కీర్తనము—నాదనామక్రియ-ఆదితాళము.

పల్లవి.

పదములనొత్తెక్ - బహు - సదమలమతితోడవిప్రుని॥ పద॥

# శ్రీ రుక్మిణీకల్యాణసంకీర్తనలు.

## అనుపల్లవి.

విదర్భాపురి నేలెడునతి  వీరుండగుభీష్మకుసుత
విదితంబుగననువు మెరిగి  మదినుల్లాసముచెలఁగఁగ॥  పద॥

## చరణము.

సూరులువేడ్కఁగఁ - తఁ - నిరతముభజియించుతరినిబరువడిగాఁగఁ
ధరమద్దులేట్పురి వెలసిన  దాసవరదుడగుశ్రీహరి
స్థిరముగభూసురవినయము  చెలువుమీరదలచియతని॥  పద॥

—:o:—

వ॥ ఇవ్విధంబున శ్రీకృష్ణుండా విప్రోత్తముని పదంబుల నొత్తుచు మెల్ల ననతనికిట్లనియె॥ *

సీ॥ జగతీసురోత్తమ సంతోషచిత్తుండ వైయున్నసీధర్మ మతిసులభము। వృద్ధసమ్మతమిది విత్తమెయ్యదియైన ప్రాపింపహర్షించుబ్రాహ్మణుండు। దనధర్మముననుండు దరలడాధర్మంబు గోరికలతనికిగురియుచుండు। సంతోషిగాఁడేని శక్రుడైననశించు నిర్ధనినికుండైన నింద్రుబోలు। సంతసించెనేని సర్వభూత సుహృత్తములకుప్రాప్తలాభ ముదితమాన। సులభశాంతులకును సుజనులకును - గర్వహీనులకునువినతు లేనొనర్తు॥ *

—:o:—

వ॥ మఱియు బ్రాహ్మణులనేకధనంబులభించినం సంతోషింతురనిబుధజనంబులువాడుదురు మీరవ్విధంబునంగాక యతిసులభంబునకే సంతోషించితిరది నాకుసమ్మతంబు * మరియునెవ్వండేని తమకులాచారధర్మంబవలంబించి ప్రవర్తిల్లునో వానికి తనమనస్సునకోరినకోర్కెలెల్లంబవనగూడు వెండియుతమకుదొరికినంతకు దమప్రాప్తంబనిసంతోషించువాడిలఁ దరిద్రుండైనను వృద్ధికెక్కుచుండు * అట్లుసంతోషింపడేని దేవేంద్రుని సముండయినను గృశించు. అట్లుగాన ప్రాప్తలాభముదిత మానసులకు శాంతులకును సుజనులకును గర్వహీనులకును యిట్టివారలకే ప్రణమిల్లెదా॥ *

తోహరా॥ అనియివ్విధమునబలికియుమరలా-యవనీసురునీక్షించి।
వినుమామీపురంబెయ్యదియిచ్చట-కెటువచ్చితిరిదిమంచీ॥మం॥ ౧౮॥
యెవనిరాజ్యమునవెలసియుందురో-యేవిధిమీజీవనమూ।
వివరముగనుయెరిగింపుడునాకది-విప్రవర్యబహుఘనమూ॥మం॥౧౯
వచ్చినపనులేమైననుజేసెద వనరుగమీమదిలోనా।
యెచ్చుకోర్కెలున్నప్పటికైనను - నిచ్చెదఘడియకులోనా॥మం॥౨౦
అనితెలియనివలెయడిగినకపటవు- యాదవోత్తమునిగాంచీ।
మనమునసంతసమొప్పగభీష్మకు - తనయవచనములనెంచీ॥మం॥౨౧

-:o:-

వ॥ అనియివ్విధంబున శ్రీకృష్ణుండు భూసురునకుంబలికి మరలయావి ప్రునింగనియిట్లనియె॥ ఓభూసురేంద్రా మీపురంబేది యిచ్చట కెటులవచ్చితిరి యెవనిరాజ్యంబున వెలసియుందురు మీజీవనంబేవిధి యీసమాచారంబుల నాకెరింగింపుడిదిమహాఘనంబగు మీమనస్సునం బెట్టితలంపు వలంచివచ్చితిరేనియు సిద్ధపరచెదనని యనేకవిధంబుల నడుగుచుండ నయ్యవసరంబున శ్రీకృష్ణుండొనరించు నుపచారంబులకు న్మదినుల్లసిల్లుచు భూసురోత్తముండమ్మహాత్మునకిట్లనియె॥

---

-*( శ్రీకృష్ణునితో భూసురుండుసంభాషించుట. )*-

కీర్తనము-కల్యాణిరాగము. ఆదితాళము.

పల్లవి.

శ్రీనివాసనామనవినిగైకొను - ఆ - శ్రితజనపరిపాలనా॥

అనుపల్లవి.

శ్రీకవినుభీష్మకునికూతురు చెలియరుక్మిణిపేరబరగిన
వాశిగలయాకన్యకామణి యొకకార్యనుపంపెదేవ॥ శ్రీ॥

## చరణములు.

ఆకాంతామణిసౌందర్యమునకు-బోలదా- అదితికోడలయిన
ఆకోమలియాదిలక్ష్మీ ఆదినారాయణుడవుపీవు
ఆకమలదళాక్షిమీకే నగునుమరియితరులకునగునా॥ శ్రీ॥

పన్నగశయనని న్నెరనమ్మియున్నదా-పంకజాక్షియిప్పుడూ
యొనరుగావిదర్భవిభుడును యొకరు-పలుకువచించెవినుడీ
దనుజుడగుశిశుపాలునకు యూ తరుణినొసగగనిశ్చయించెను॥ శ్రీ॥

యిందిరమందిర సుందరగోవిందా యిందువదనకొఱకై
యిదివిధంబునయుండిగావున వేగమేమీరరుగుదెంచియు
విదితముగశత్రులనడంచియు వీరమోహిని నేలవలయును॥ శ్రీ॥

శరణుశరణు యని శరణుజేశియా చెలియ చెప్పమనియెనూ
ధరనుముద్దుతేట్పురిని వెలసిన దాసవరదాదయను జేర్చియు
కరుణతో నన్నేలవలయును కమలలోచనయనుచుబలికెను॥ శ్రీ॥

-:o:-

వ॥ విదర్భ దేశంబేలు భీష్మకుండను రాజునకుం రుక్మిణీయనునామంబునం బ్రకాశింపుచు నొకర-సుతరత్నంబుగలదు నయ్యిందువదననీకుంగై ంకర్యంబు సేయంగోరి వివాహమంగళప్రశస్తంబగు నొకర- సందేశంబువిన్నవింపుమని వృత్తాంతంచెనవధరింపుము ✻ ఆ భీష్మకుండు కొడుకుపలుకులకొడంబడి మిస్మువరించియుండు తనకూతురనుం శిశుపాలునకిచ్చుట నిశ్చయించుటెఱింగి యబ్బాలికామణి యనేకవిస్మయచిత్తయై యీవిధంబంతయుమీకెరింగింపవలయుననుచు ననుంబనిచెంగాన ✻ మీరతివేగంబున విదర్భదేశంబునకేతెంచి శత్రురాజులం జయించి యబ్బాలికనుంగొనివచ్చి వివాహంబు జేసికొనవలయునని చెప్పిమరియు రుక్మిణీదేవి తెలుపుమనిన పలుకులం జెప్పుందొడంగె॥



సీ॥ ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోకదేహతాపంబులు దీరిపోవు। నేనీశుభాకార మీక్షింపకన్నుల కఖిలార్థలాభంబుగలుగుచుండు। నేనీచరణశేవ మేపొద్దుజేసిన భువనోన్నతత్వంబుబొందగలుగు। నేనీలసన్నామమే పొద్దుభక్తితో వొడివినబంధసంతతులువాయు * నట్టినీయందునాచిత్తమనవరతము- నచ్చియున్నదినీయానయాన లేదు-కరుణజూడుముకంసారి ఖలవిదారి - శ్రీయుతాకారమానినీచిత్తచోరా॥ *

ఉ॥ శ్రీయుతమూర్తిరాయోత్పురవ సింహముసింహము పాలిసొమ్ముగో। మాయువుగోరు చందమున మత్తుడుచైద్యుడునీపదాంబుజ। ధ్యాయనినైనన్నువడిదాగొనిపోవెదనంచునున్నవా। డాయధమాధముం డెరుగడద్భుతమైన భవత్ప్రతాపము॥ *

వ॥ ఏనుగకుంభస్థలంబందుండుమెదడు సింహమునకుసొమ్మైయుండ నదియునక్కగోరుచందంబున మీపదాంబుజపానంబునసక్తయాశ్రయించి ననన్ను త్వత్ప్రభావంబెరుంగక * రాక్షసాధముండగు శిశుపాలుండతిశీఘ్రంబున ననుంగొనిపోవందలంచియున్నవాడూ ఇవ్విధంబున రుక్మిణీదేవిదెలిపినట్టుల విన్నవించి విప్రుండుమరియునిట్లనియె॥ *

---

కీర్తన— యమునాకల్యాణిరాగము - రూపకతాళము.

పల్లవి.

యేలామదినెంచగ - గో - పాలాకరుణాలవాల

అనుపల్లవి.

బాలామణిరుక్మిణీగుణ శీలాసౌంధర్యమువిను॥ యేలా॥

చరణములు.

చాలానెతలపగయా సారసభవుసతికినిశశి
పాలాత్మునిపత్నికిమరి పంచశరునిపడతికైన

యాలావణ్యముగలుగునె యావనితను మెన్నగనా
పాలాయికనచ్చాలిక పాలకడలిసుతయనవలె
(ద్రుత)జాలము గాయక వేగమె చను దెంచియు నా వెలదిని
యేలుమ నీకృపచేతను యిల శేషాదాసవినుత॥ యేలా॥

—:o:—

వ॥ శ్రీకృష్ణా మీమనంబునయోచించు కేల యారుక్మిణీదేవి సౌందర్యం బెంచిచూడ సరస్వతీదేవికైనం బార్వతీదేవికైన్న శచీదేవికయినన్ రతీదేవి కయినన్ లేదు గాన అట్టిసౌందర్యంబెన్న నావశంబవునే యికనుయాసుదతి సన్ లక్ష్మీదేవియనందగు గావున * ఆలస్యము సేయక మీరే తెంచియాముగువం గానివచ్చి వివాహంబు జేసుకొనవలయునని చెప్పి వెండియు రుక్మిణీదేవిబలికి నవాక్యంబులందలంచి యిట్లనియె॥ *

ఉ॥అంకిలిసెప్పలేదు చతురంగబలంబులతోడ నెల్లి యో। పంకజనాభ నీవు శిశుపాలజరాసుతులంజయించినా। వంకకువచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే। యుంకువజేసికృష్ణపురుషోత్తమ చేకొనిపొమ్ము వచ్చెదన్॥*

వ॥ ఓదేవా నే నబద్ధంబులంబలుకలేదు అనేకంబులయిన సైన్యంబులం గూడిమీరతిశీఘ్రంబున యిటకుంజనుదెంచి శిశుపాల జరాసంధాదులం జయించినా మెడంజను దెంచియు రాక్షసవివాహంబున మీచాతుర్యాశ్శంబునన్ యుక్తిజేసి యెవ్విధంబుననైనం గొనిపోందు వచ్చుటకుంగాచియున్నదాన మరియును॥ *



తోహరాచరణములుం - యాలలూ

లోపలిసౌధములోవశిఞంపుచు - నుండెదుయయువిదనునివుడన్
యేపగిదిని తేవచ్చును తెచ్చిన - యెటు రావచ్చునునకటన్॥మం॥ ౨౨

( యా ల. )

కావాలీహారలనూమరియు కలబంధువులనుజంప
కావనితనుయిటకునూ శ్రీకృష్ణావినుము యేవిధమునా తేవచ్చునూ॥౧

( తో హ రా. )

యనియోచించగవలదువినుతిసే - యురయగజెప్పెదనిపుడు।
వనజాక్షియుమీకిన్నవింపుమని - వనరుగబలికినదపుడు॥మం॥ ౨౩

( యా ల. )

నగరామునకూవెలుపల నగజాతకుమ్రొక్కేటకొరకు అగణితముగామా
వారంపేమ శ్రీకృష్ణావినుమూ సొగసుమీరగ పెండ్లికిమునుపూగా ॥ ౨

( తో హ రా. )

యావిధముగనక్ నగజాతకుయు - స్నానముగమ్రొక్కుటకపుడు।
యువనవిభుముమవినుప్పొంగుచు - యచ్చటికనువునుమీరవుడు॥ ౨౪

( యా ల. )

పంకాజాక్షామీరేతెంచి పద్మగంధినై నానన్ను పొంకముగానెత్తుకచను
ము శ్రీకృష్ణావినుమూ యుంకువుగానిటులచెప్పంపేనూ॥ ౩

వ॥ లోనయంతఃపురంబునమంము వనితను అచ్చటి కావలియుంము వారలను మరియనేకబంధువులక్ జంపకనేవిధంబునంగై కొనవచ్చునని మొదుమోచనంబవిలేదు యింమనకే నొక్కయుపాయంబు జెప్పెదవినుండు * మాపురంబునకువెలుపలనొక దాక్షాయణి మందిరంబు గలదు నంము వివాహకాలప్రథమపక్షంబున పెండ్లికూతురినిం యాగౌరీదేవికింబూజ సలుపననువుటంము మతుకులాచారంబగుగావున * యావిధంబున-మాంవారున్న నన్నుంబురమువెలువడి నగజాతకుమ్రొక్కంగంబనిచెద రావేళంగని మీరేతెంచిననుంగొనిపొందువచ్చెదవనజనేత్రా॥ *

( తో హ రా. )

ప్రాకటముగబుధులాత్మనుదెలిసియు-పరిపూర్ణునగుటకునూ।
జోకమీరగంగాస్నానంబును - శుచిమీరయొనర్చియునూ॥మం॥ ౨౫॥

( యా ల. )

యేవిధముగాభక్తియుంచీయేవిధముగాశివునిపూజానైవిధముగాచేయు
వారాలో-శ్రీకృష్ణావినుమూ - నావిధముగానే నీ పూజాలూ॥ ౪

## ౨౬ శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

( తోహరా. )

సేయుచున్నదాననునామదిలో- సిద్ధమునినువరియించి।
బాయకనన్నేలుము నేజేసెటి - భక్తినిమీమనమెంచి॥ మం॥ ౨౬॥

( యాల. )

న్యాయాంమూగానూరేంల్లడైన నారాయణమీ పాదస్మరణా చేయా
చుండునట జేర్చాకున్నానూ-శ్రీకృష్ణావినుమూనీయిలప్రాణములిడచేనూ

-:o:-

వ॥ మరియుబుధజనంబులందరు ఆత్మ నెరింగి సత్పుణ్యులగుటకునై గంగాస్నానాదిశుచితోడంగూడి యేవిధంబున శివునిపూజసేయువారలో ఆ విధంబున యేనునుంమిమువరించి యనేకపూజలొనర్చుదానంగాన * యివ్విధంబెల్లయునెరింగి ననుంగ్రైకొంటిగేనియు సరిలేసియెడల నీధరిత్రియందు నాదుప్రాణంబులనిలుపజాల నెంకనూరుజన్మంబులకైనను మింమేభజింపుచుందుదు మీరేలకుంటిరేని నాదుజీవంబులిడచుట తధ్యంబగుప్రాణేశ్వరా॥

-:o:-

సీ॥ ప్రాణేశనీమంజు భాషలువినలేని కర్ణరంధ్రంబులకలిమియేల।
బురుషరత్నమనీవు భోగింపగాలేని తనులతవలనిసౌందర్యమేల।
భువనమోహననిన్ను బొడగానలేని చక్షురింద్రియములసత్వమేల।
దయితనీయధరామృతంబానగాలేని జింహ్వాకుఫలరస సిద్ధియేల।
నీరజాతనయన-నీవనమాలికా-గంధమబ్బలేనిఘ్రాణమేల
ధన్యచరితనీకుదాస్యంబుశాయని-జన్మమేలయెన్నిజన్మములకూ॥

—:o:—

కీర్తనము—బ్యాగ్ రాగము - ఆదితాళము.

పల్లవి.

నిన్నేవరించితి    నీరజనయనా॥ నిన్నేవరిం॥

అనుపల్లవి.

పన్నగశయనయో పరిమదయానిధే
వన్నెమీరగనేలూ వాసవ వారిజభవనుత॥ నిన్నే॥

చరణములు.

గరుడగమన నినూ శరణనియెదరా
పరమపురుషానను పాలనజేయుమీ
చరణమునమ్మితి శంకర గణాధిపస్తుత॥ నిన్నే॥

ధరనుమద్దులేట్పురీ దాసవరదాహరీ
నిరతమునీవెనక నేలువాడావని
నెరనమ్మినానువే రెరుగజాలకరుణజూడు॥ నిన్నే॥

—:o:—

వ॥ అనియిట్లు రుక్మిణీదేవి వృత్తాంతంబివసందేశంబులు రూపసౌందర్యాదివిశేషంబులును బ్రాహ్మణుండు హరికివిన్నవించి కర్తవ్యంబెద్దిసేయు నవధరింపుమని సవరణగానిట్లనియె॥

—:o:—

కీర్తనము- కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

జగన్మోహనాంగి యో జగదీశ్వరమీకేతగునాసతి॥జగ

అనుపల్లవి.

అగణితమునగనా మగువవిలాసము
తెగవర్ణించెద ఖగవాహనవిను ॥ జగన్మో॥

చరణములు.

అలచీమలబారు అయ్యాతివడునూగారు
సలలితచికురా కులవలెపదములు

# శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

చిలుకపలుకు తో వెలసరిస్వరమును
తిలపుష్ప మేనా తికినాసికమగు
కలయంచనడలు గలదయ్యింతికి ॥ జగన్మో ॥

లేమకు నేత్రములు అల లేడికండ్ల బోలు
మోము వెన్నెగను సోమబింబమవు
కాముధనుమొనలు కనుబొమలెలయును
సామజవైరికి సమమగుమధ్యయు
కామినికంఠము కంబుయనందగు॥ జగన్మోహ॥

మెరుపుటద్దములను కాంతికి మించిన చెక్కిళ్లును
అసమాప్రభామానో హారముఖగరములు
పరిహాసితయిందు పటలనిటలమగు
మరియు పల్లవా ధరయగు వెన్నగ
మెరియు కుందముల సరిపల్వరుసను॥ జగన్మోహ॥

నిమ్మపండ్ల బోలు ఆ నెలతకు పాలిండ్లు
తుమ్మెద రెక్కలై తోచె కురులును
కమ్మవిల్తునిశ రమ్ములకొనల
య్యమ్మచను మొనలు యగుచుకనకమయు
బొమ్మపగిది యొడ లాలుపగుచుండును॥ జగన్మో॥

రంభాస్తంభములు అల రమణికిగలతొడలు
జంఘ బేదిప్రియ సతికై నను యా
అంబుజాక్షిచి హ్నములు లేక్క జగ
ంబయనగపతె ధర శేషయనత
డంబమగదున య్యుంబయి నెలును॥ జగన్మో॥

ఉ॥ ఆమెలనాగనీకువగు నంగనకుందగుదీవ్రమాయుపా । ధ్యాయుల యాన పెండ్లియగుదప్పదుజాడ్యములేలనీవునీ । తోయమువారుగూడుకొని । తోయరుహాననదెత్తుగానివి । చ్చేయుముశత్రులన్నరుము శేయుము శేయుము శోభనంబిలిక॥ *

వ॥ ఇవ్విధంబున తనవృత్తాంతంబంతయుంగరిపి మీమనంబురంజిల్లంజేసి యెవ్విధంబుననైనం తన్నేలుకొనునటుల మెప్పించి తోడితెమ్మనియు విదర్భేశుండగు భీష్మకరాజసుతయా రుక్మిణీదేవియు॥ *

—:o:—

కీర్తనము—యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

నన్నుబంపెనయ్యా దేవ నారాయణా శ్రీహరి॥ నన్ను॥

అ ను ప ల్ల వి.

నన్నుతాంగనీదువయో సౌందర్యమునకుసరిగల
వన్నెమీరియున్నదియా వనితనువణికింపవశమె॥నన్ను॥

చ ర ణ ము లు.

నీమమదిసిరంజిల్లగ నేర్పునభాషించియు - నో
మాధవతన్నేలునటుల భోధజేయుమనుచు వేటక॥నన్ను॥
నిరతముమీయిరువరులకు పరిణయమగుతప్పదుమా
గురుసాక్షిగకల్లగాదు సరగునవిచ్చేయుడికను ॥ నన్ను॥
వాసవవారిజభవులకు వశముకాదుమిమ్ముబొగడను
కేశవమ్మనుభాషశేష దాసవినుతశ్రీరమేశ ॥ నన్నుబం॥

వ॥ ఆ రుక్మిణీదేవియే మీకుందగూ మీరామెకువరుండగుదురూ మా యుపాధ్యాయులసాక్షిగా మీయిరువురకు వివాహంబగుట నిశ్చయంబగుంగాన మీరతిశీఘ్రంబునంవిచ్చేయుండికతడవేలా॥ *



తోహరా॥అనియివ్విధమునబలికినబ్రాహ్మణుడు-యానతియూహించి।
ఘనుడగుభీష్మకుసుతవుత్తెంచిన-క్రమమును తామదినెంచీ॥ మం॥ ౨౭
మనమునసంతోషంబుప్పొంగగ-మహీసురువదనముజూచి।
వినుమనిపలికెనువేణువినోదుడు-వెలదినితనమదిజేర్చి॥ మం॥ ౨౮

శ్రీ కృష్ణుని వాక్యము.

చ॥ కన్నియమీదనాతలపు గాఢముకూరకురాదురేయినా। కెన్నడునా వివాహముసహింపక రుక్మిదలంచుకీడునే। మున్నెమెరుంగుదుంబరులమూకనడంచికుమారిదెత్తు । విద్వన్నుతమాత్రనుద్రచ్చినవవహ్నిశిఖల్వడిదెచ్చుకైవడిన్॥ ... ... ... ... ... *

వ॥ఓభూసురేంద్రా యాకన్యయందుఁగల ప్రేమాతిశయంబుననాకు రాత్రికాలంబునందు నిద్రయుంబట్టనేరదుయాముదితయు ననుంగోరి యెప్పుడు వివాహంబగునని వ్యసనపడుచుండుటయు మునుపే నాకుతెలుసునుగాన నో య్యానుంవాలసి నూతనయగ్నింగోనువిధంబున యాశత్రురాజులం జయించి యాసుందరింగైకొనివచ్చెదనని చెప్పి మఱియు శ్రీకృష్ణుండు బ్రాహ్మణోత్తమునకిట్లనియె॥ *

కీర్తనము — నాదనామక్రియరాగము - ఆదితాళము.

పల్లవి.

వచ్చెదపద రయా - విదర్భపురము - జెచ్చెరవిప్రవర్యా॥వచ్చె॥

## అనుపల్లవి.

సచ్చరిత్రంబుగ సకలరాజులు మెచ్చ
మెచ్చుప్రతాపముచే వెలదినిగొనిపోవ ॥ వచ్చె॥

## చరణములు.

మేలనాగకునేలా - యికమీదనీ యిలశోకముమేలా
వలదువలదుబహు వాంఛగలదునాకు
సలలితముగనా సఖియశోకముమాన్ప ॥ వచ్చె॥

మచ్చకంఠిపైనా-నామోహము-హెచ్చుచుందిగాన
మెచ్చుగదైత్యులరాజు లెదురులైననుడాయ
వచ్చినవారల వధియించిచేకొందు॥ వచ్చె॥

నిరతముమదినెంచుమా - భూసురేంద్ర- నెలతనుగొనలక్ష్యమా
ధరమద్గులేట్పురి దాసవరదుడగానా
తరుణికొరకైనేడు తద్దయువేటకతో॥ వచ్చె॥

శ్రీకృష్ణుడు కుండినగరంబునకు రథారూఢుండైచనుట.

తోహరా॥ అని శ్రీకృష్ణుండునుతనసారథి-నతిశీఘ్రముగాబిలచెన్।
జవవలెమనముచిధర్భపురికిని-జాగుసేయవలదనుచున్॥ మం॥ ౨౯
ఘనమగుమనరథమునకునశ్వముల-కడువడిబూన్చియునిపుడున్।
చనువుగతెమ్మనిచెప్పిపంపెనా-సారథితోడనునపుడున్॥ మం॥ ౩౦
పరమపురుషుమాటనుజవదాటక-బహుసంతోషంబులతోన్।
సరగునచనుయశ్వంబులదెచ్చియు-సారథితననేర్పులతోన్॥ మం॥ ౩౧
శృంగారించియురథమునగట్టెను సొంపుచెలంగగమిగులన్।
మంగళంబుగను శ్రీకృష్ణుండును-మహీసురుచేరావేళన్॥ మం॥ ౩౨

రథము నెక్కి గను గడగడ మును చొక్క - రాత్రి తెల్ల వారగనూ।
యదుకులోద్భవుండతి వేగంబున - యావిదర్భ చేరగనూ॥ మంగ॥ 33



వ॥ అంతను [illegible] బరికి రుక్మిణీదేవి సందేశపత్త్రంబు జెలసి సారథిం బిలిచి రథంబునకు అశ్వంబులం గట్టి తెమ్మనిన నతండతి శీఘ్రంబునం జని తురంగంబులం దెచ్చి రథంబు శృంగారించినం గని తానును బ్రాహ్మణుండును నారథంబెక్కి యేకరాత్రంబున యనేక దేశంబులం గడచి విదర్భ దేశంబునకుం జనుదెంచి రెట్లనినా॥ ※



కీర్తనము — శంకరాభరణరాగము - రూపకతాళము.

పల్లవి.

వెన్నుడరుగుదెంచెనపుడు విమలవిదర్భదేశమునకు॥ వెన్ను॥

అనుపల్లవి.

వెన్నుడు సంపన్నుడు - అల - పన్నగాధిపశయనుడు॥ వెన్ను॥

చరణములు.

ఎక్కసగను హేమకశిపు డక్కుమా ప్రహ్లాదుని
చిక్కు బెట్టభక్తునికై రక్కసుని జంపిన నరహరి
(ద్విత) మక్కువ రుక్మిణి బలికిన యొక్కవలను విప్రునిబహు
పెక్కులంగా దెలుపవిని యు గ్రక్కున రథమెక్కి యువడి॥ వెన్ను॥

చక్రధారియగుచుమిగుల విక్రముడై వెలసిల్లుచు వెన్ను॥

శిరినియురము దాల్చిన శ్రీ కరుండు భవహరణుడు మురహరీ
సరసిజనాభుండు ముని సన్నుతుండును మరీ

నిరతమునీవేగతియని నెరనంబినగజనాధుని
మొరవినిమకరినిద్రుంచియు వెరవునుబాపినశ్రీహరి॥ వెన్న॥

ఆర్యజనసమ్మతుండు అద్యుతుడఖిలేశ్వరుండు॥ వెన్న॥

మునుసురులకోరకుదశరధ జనపతికినితనయుడగుచు
జనకుడుసతికొసగినవర మునుజరిపించుటయెఘనము
(ద్రుత)అనుచునుయనుజునితోడను వనితనుగూడియును కా
ననములజనివశియింపగ దనుజుడుసతిగొనిపోవగనీ
దినకరసుతుజేరియు వా లినిజంపియునబ్ధిగట్టి
ఘనదైత్యులదునిమిలోక జననిగొనినశ్రీరాముడు॥ వెన్న॥

వన్నెకాడుయంమెకాడు సన్నుతాంగుడగువాడు॥ వెన్న॥

చెన్నుగధర శేషయ్యాడు శిరులొసగినవనజాక్షుడు
వెన్నదొంగలించువాడు వ్రేతలకెల్లనునాధుడు॥ వెన్న॥

-:O:-

వ॥ ఇవ్విధంబున శ్రీకృష్ణుండు బ్రాహ్మణసమేతుండై విదర్భదేశంబున కుంజనియె నందు కుండినపురీశ్వరుండయిన భీష్మకుండు కొడుకునకు వశుండై కూతు శిశుపాలునకిత్తుననిదలంచిశోభనోద్యోగంబు సేయించెనప్పుడు॥

-:O:-

కీర్తనము - నాదనామక్రియ రాగము - ఆదితాళము.

పల్లవి.

శృంగారించిరావేళలోన - యా - కుండినపురమున॥ శృం॥

అనుపల్లవి.

శృంగారించిరి సొంపుమీరగను
బంగరుమయముగ భీష్మకుపురమ్మున॥ శృంగా॥

## చరణములు.

అచ్చామైనట్టిముత్యములు ముగ్గులనుదీర్చి
మెచ్చాగుమాణిక్యతోరణములు కట్టియుబాగా
రచ్చలుగ్రంతలు రాజమార్గముల
మెచ్చుగచందనం వేటగుపన్నీరు
సచ్చరితంబుగ చల్లియునవలను
యిచ్చగనాపురి వీధివీధులను॥ శృంగా॥

యరుదాగపురస్త్రీలునుదుటను కస్తురితిలకముల
సరిదీర్చికుంకుమ గంధమును నలదియువేగ
సరిగచీరలును సరియగురవికెలు
శిరమునముత్యాలు సరులునుగొలుసులు
యురమునమణులను మెరయుహారములు
కరములగాజులు గలభూషణములు॥ శృంగా॥

అట్టివేళానాపురుషులెల్లా ఆనందముగ
పట్టుబట్టలను మేనెల్ల గట్టియు పాగలను
చట్టముగాతల జుట్టియురమునను
అట్టిబంగరపు ఆభరణంబులు
మట్టసమగు బహు మణులహారములు
దట్టముమీరగ ధరియించియునతి॥ శృంగా॥

సరియైనసలవపందిళ్లను నప్పట్టణమునను
బరువడిగనుజోడించియును అంతటబాగా
పరిపరివిధముల బరగువాద్యములు
ధరనుమద్దులేటవ్ పురమునవెలసిన
కరివరదునిదయ కలిగియుండుఅల
సురులపురమువలె సొంపుచెలగంగ॥ శృంగా॥

వ॥ అంతనా భీష్మకుండు విహితప్రకారంబులం బితృదేవతలనర్చించి బ్రాహ్మణులకుభోజనంబులుబెట్టించి మంగళాశీర్వచనంబులుచదివించి రుక్మిణీదేవి నభిషిక్తంజేసి * వస్త్రయుగళ భూషితంగావించి రత్నభూషణంబులిడి రుగ్యజుస్సామ మంత్రంబుల మంగళాచారంబులొనరించి భూసురులు రక్షాకరణంబులాచరించిరి * పురోహితుండు గ్రహశాంతికొరకునిగమ నిగదిత న్యాయంబున హోమంబుగావించెమరియు నారాజదంపతుల మేలుకొరకు తిలధేను కలధౌత కనకచేలాదిదానంబులు ధరణీదేవతలకొసంగె నయ్యవసరంబున॥ *

—:o:—

శి శు పా లుం డే తెం చు ట.



కీర్తనము—సురటిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

చేదిదేశనృపాలకుండగు శిశుపాలుడువెడలెన్॥

అ ను ప ల్ల వి.

ఖ్యాతిగభటులును కైవారింపగ
మోదముగనురథ మునవెక్కియువడి॥ చేది॥

చ ర ణ ము లు.

బంధువర్గప్రియు పరిజనంబులా
నందులగుచుబహు తొందరగదలగ॥ చేది॥ ౧॥

ఘటికులగుచుబహు గజతురగములతొ
గటుసంరంభము గడలుకొనంగగ॥ చేది॥ ౨॥

ధరమద్దులేట్పుర హరిసతియనిఘుది
సెరుగకాసెలత నేలగనెన్నుచు॥ చేది॥ ౩॥

వ॥ ఇవ్విధంబున శిశుపాలుండవ్వీటికింజనుదెంచె నయ్యవసరంబున॥ *

తోహరా॥బంధువులందరుగూడికృష్ణబల - భద్రులువచ్చినవార్తలన్।
యందమునుయదలించిచైద్యున - కవ్వనితనుమనమలరన్॥మం॥ ౩౪
గూర్చెదమనుచునుయుప్పొంగుచుగజ - ఘోటకంబులనునపుడున్।
చేర్చుకొనియుజరాసంధుండును - సేనలుగొలుచుచునుండన్ ॥ ౩౫
దంతవక్త్రుడునుసాళ్వవిదూరక - ధరణివల్లభులుమిగిలి।
పంతములాడుచురధములెక్కి-కాల్- బలములతోడనుగదలి॥మం॥ ౩౬
వచ్చిరిశిశుపాలుకుసహాయులై - వనరుమీరనావేళన్।
మెచ్చగభీష్మకుడెమరేగియుతగు - మేలిమిసల్పియునిల్పెన్॥మం॥ ౩౭

—:o:—

వ॥ అయ్యవసరంబున మత్ బంధువులందరుంగూడి బలరామకృష్ణులువచ్చిన వ్వారలంవరిమి రుక్మిణీదేవిని శిశుపాలునకిచ్చి వివాహంబుజేసి సంతోషించెదమని యాలోచించి మనంబునఉప్పొంగుచు ననేకరధగజ ఘోటకంబులతోడను ననేకసేనలంగూడి జరాసంధదంతవక్త్రసాళ్వ విదూరక పౌండ్రకాదులాదిగాగలనానాదేశంబుల రాజులనేకులేతెంచి యున్నవారలందు * శిశుపాలునెదుర్కొని పూజలుసలిపి భీష్మకుండొకగొనివేశంబున నతని విడియించె నంతందద్వృత్తాంతంబంతయువిని॥ *

-:o:-

శ్రీకృష్ణునకు సహాయుండగుచు యాదవసేనలంగూడి
బలరాముండేతెంచుట.

—:o:—

చ॥ హరియొకడేగినాడు మగధాధిపులుచైద్యహితానుసారులై। నరపతు
లెందరేని జనినారుకుమారిక దెచ్చుచోట । సంగరముగుదోడుగావలయుకం
సవిరోధికినంచువేగ । దానరిగె హలాయుధుండు గమలాక్షునిజాడననేక
సేనతోన్॥ ... ... ... ... ... *

వ॥ హరిగాయుండబడిన శ్రీకృష్ణుండొక్కఁడే చనుదెంచియున్నవాఁడూ అచ్చట మగధదేశపతియగు జరాసంధాది మొదలగు రాజులనేకులుగాశిశుపాలునకు విహితులై వచ్చియుందురు యీ భీష్మకరాజసుతం గొనివచ్చు సమయంబునందనేక సమరంబుజరుగఁబోవు కాబోలు నకటం గంసవిరోధియా శ్రీకృష్ణునకుం దోడుగావలయునని మనంబునందలంచి బలరాముండనేక సేనలంగూడి యాహరియేతెంచిన తెరువుంబట్టి సమరసన్నాహంబునం జనుదెంచె॥ *

క॥ ఆలోపలనేకతమున। నాలోలవిశాలనయన యగురుక్మిణిద। న్నాలోకలోచనుదుహరి। యాలోకముచేసికదియడనిశంకితమై॥ ... *

వ॥ అంతకులోనకటా రుక్మిణీదేవి హరిందలంచి తనమనంబున విలపింపందొడంగె॥ *

—:o:—

శ్రీ రుక్మిణీదేవితన మనంబున శ్రీకృష్ణునిదలంచి విలపించుట.



తోహరా॥ లగ్నముదించెవివాహముగదిసియు-భగ్నంబగానేమందుఁగ।
విఘ్నంబయ్యెడిమానసంబువినో-విష్ణువురాడేయిందుఁగ॥మం॥ ౩౮
యీవృత్తాంతంబావనజాక్షుకు - యెరిగించెనోవిప్రుండుఁగ।
వివరించకనెంతైనదాగెనో - విష్ణుచేరదడసిప్పుడుఁగ॥ మం॥ ౩౯
నాయత్నంబునునయమగునోనటు- నయమగుటకువిధిలేదో।
కాయమునిలుపగజాలనునాపై- కాత్యాయనికృపలేదో॥మం॥ ౩౦
ఘనుడగువిప్రుండరిగెనోయరుగడా - కమలలోచనునికడకుఁగ।
చనఁచుండెడిమార్గముతప్పియా - వనమునఁనుందునోపోకఁగ॥౪౧
వినికృష్ణుండిదితప్పనిగదలచెనో - విచ్చేసెనోయీశ్వరుడుఁగ।
ననుకూలింపదలంచునోదలపడో - నాభాగ్యంబెటులోయిప్పుడుఁగ॥౪౨

—:o:—

వ॥ వివాహలగ్నంబు సమీపించెంగాన అతిక్రమించి నిర్విఘ్నంబగునే మో యిట్లతిక్రమించు టెట్లింగి యాకృష్ణుండు రాఁడాయనో లేక యీవృత్తాం తముల భూసురుం డెఱింగింపక మధ్యన్ త్రోవతప్పి యాదేవుకడకుం బోక నిలచియున్నవాఁడో * మఱియు విప్రుండే తెంచి హరినింభాషింపం వెఱచియున్నవాఁడో అట్లుగాక భాషింపంగని. శ్రీకృష్ణుండు సమ్మతించెనో వెండియు సంమతించండాయెనో విధివశం బెటులున్నదో తెలియదాయె * మరియా విప్రుండింతకు రాఁడాయనేమో యని యివ్విధంబున తానుబంపించిన బ్రాహ్మణోత్తముని రాకకెదురుచూచుచు నాదుకోర్కెలీడేరునా యేమో నామీఁదం గౌరీదేవికింగృప లేదేమో యని చింతింపుచుండె మరియునూ ॥*



ఉ॥ చెప్పదుతల్లికిందలవుచికురాదిశల్దరహాసచంద్రికల్। గప్పదువక్త్ర తామ్రసగంధసమాగతభృంగసంఘమున్।గొప్పదునిద్రగైకొనదు రోజప రస్పరసక్తహారముల్।విప్పదుకృష్ణమార్గగతవీక్షణపంక్తులద్రిప్ప దెప్పుడున్॥

వ॥ అనియివ్విధంబున శుకయోగీంద్రుండు పరీక్షిన్మహారాజునకుం జెప్పి మఱియునిట్లనియె॥ *



కీర్తనము— ధన్యాసిరాగము - ఆదితాళము.

పల్లవి.

వెలదిచింతనల విన్నవించెదను వెటకా-తోడవినుమధిపా॥

అనుపల్లవి.

చిలుకతో వెలల చెలిమినిసలుపదు
కలికివీణచే గానముశాయదు॥ వెలది॥

చరణములు.

తుడువదుకన్నుల-వెడలుచునుండెడు-తోయకణంబులను

| | | |
|---|---|---|
| ముద్దువదుకురులను | ముచ్చటలాడదు | |
| కుదువదుయన్నము | గ్రోలదునీరును॥ | చెలి॥౧॥ |
| జలములనాడదు- పూలవనమునను- | సఖియానందముగాఁ | |
| చెలియలతోడను | చేరితిరుగదా | |
| పొలతిపూలతల | పోషణజేయదు॥ | చెలది॥౨॥ |
| ధరమద్దులేట్పూరి- దాసవరదునా- | తరుణిమదినిజేర్చి | |
| కరమరుదుగతిల | కమనుదుటనిడదు | |
| విరులశయ్యపై | వేటకవసింపదు॥ | చెలి॥౩॥ |

—:౦:—

వ॥ మరియును ॥

మ॥ మలగుఁ మెల్లనిగాలికిఁ బటునటన్మత్తద్విరేఫాళికి । న్దలగుఁగో యిలమోత్రకై యలగునుద్యత్కీరసంభాషలఁ । నలుగుఁ వెన్నెలవేడిమిఁ మెలగుమాకందాంకురచ్ఛాయకుఁ । దొలగుఁగొమ్మమనోభవానలశిఖాదోగ్ధూయయానాంగియై॥ ... ... ... ... *

వ॥ ఇట్లు శ్రీరుక్మిణీదేవి జగద్రక్షకుండగు శ్రీకృష్ణునిందలంచుచు విరహాగ్నిం దగులువడి మిక్కిలి విన్నబోవుచు తనదు చెలికత్తియతోనిట్లనియె॥

—:౦:—

కీర్తనము-యమన్ రాగము - ఆదితాళము.

పల్లవి.

రాడాయను గదవె చెలియా - యిటు - రాడాయనుగదవె॥

అనుపల్లవి.

| | |
|---|---|
| చేడెవినుమియా | శ్రీహరిచెలువము |
| యీడగునాసరి | యింతులకుదలప |

ప్రౌఢిమిగనురతి క్రీడలను మెలగి
గూడిననామది కోర్కెలీడేరును॥ రాడా॥

చరణములు.

అల్లకృష్ణుసరి మైనవరునిధర
మెల్లెడలమిగుల వెదకినలేడట
పల్లవాధరినా భావముననుబహు
తల్లడిల్లుగదె తరుణీయిదివరకు॥ రాడా॥౧॥

భూసురుడరిగిన పొలకవనెరుగము
భాసురాంగుడెటు భాషించెనుమరి
యీసమయమునకు యేలనరుగడుకై
లాసగిరినిలయ లలనదయలేదో॥ రాడాయ॥౨॥

కరివరదుండట కనకాంబరుడట
సరసిజభవముఖ సన్నుతాంగుడట
ధరమద్దులేట్పురి హరియతడేనట
యరుడెంచినసరి యగునువ్రతమునిట॥ రాడాయ॥౩॥

వ॥ ఇట్లువారిరాకకెదురుచూచుచు సకలప్రయోజనంబులయందునువిరక్తయై మనోజానలంబునంబొగిలెడి మగువకు శుభంబుజెప్పుచందంబునవామోరులోచన భుజంబులదరె ✻ నంత శ్రీకృష్ణుని నియోగంబునబ్రాహ్మణుండుచనుదెంచిన నతనిముఖలక్షణంబుపలక్షించి యాకలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిరునగవునిగుడనెదురంజని నిలువంబడిన బ్రాహ్మణుండిట్లనియె॥ ❀

## భూసురుండు శ్రీకృష్ణునివద్దికింబోయివచ్చిన వృత్తాంతంబుల రుక్మిణీ దేవికి జెల్పుట.

కీర్తనము—కల్యాణిరాగము - ఆదితాళము.

### పల్లవి.

మెచ్చెను శ్రీకృష్ణుడు - మేయధనావ - ఖచ్చెనుగోపాలుడు॥

### అనుపల్లవి.

సచ్చరితంబగు సకలసొమ్ములను
హెచ్చైనచేలముల యిచ్చితోడనిచ్చె
(ద్రుత) హెచ్చుగను ప్రహ్లాదభక్తుని హేమకశిపుడు నొచ్చ జేయగ
వచ్చెదను జేంద్రునివధించియు వనరనర్భకుగా చెనరహరి॥ మె

మానినిరో వినుము - నాతో నుమీ - రినుపించినక్రిమమూ
యేనువేటగా దెల్ప వెన్నుడుయూహించి
కానరో అల్లదొ చనుదెంచుచున్నాడు
మానవతివినుమునుకరింద్రుడు మకరిచేబహుతగులబడితను
ధ్యానమును జేయగ మకరితల దృంచి సెలినశ్రీరమాపతి॥ మె॥ శ్రీ

సారసాక్షిరో నేడూ - నీమదిగల - సందేహములవీడూ
క్రూరముతో రాజ వీరులెదుర్కొనిన
వారలవధియించి వనితనేలుదుననెను
సూరుడగునుత్తానపాదుని సూనుడగు ధృవునకువరంబుల
కోరియొసగియుఘనతజేసిన కోటిసూర్యసమానతేజుడు॥

సామాన్యముకాదు - నీభాగ్యమే - భామామణికిలేదు
భూమినిమద్దులేట్ పురిభక్తవరదుడౌ
కామజనకుపతిగ కమలభవుడుగూర్చె

వామనుండయి - మూడుయడుగుల-వసుధనిమ్మనిబలినినడిగియు
తామసమునశాయకరసా తలమునదొ్రక్కినపరమపురుషుడు॥ మం॥౪

వ॥ ఇవ్విధంబున నిమ్ముకల్యాణంబు జేసుకొనుటకై శ్రీకృష్ణుండుత్సహించి నాకనేక వస్త్రభూషణంబులం బహుమానంబులొసంగెననుచు అమితోత్సాహుండై పలుకుచున్న ధరణీసురోత్తమునకు రుక్మిణీదేవియిట్లనియె॥

తోహరా॥ జలజాక్షుతోడి తెచ్చితివి-సందేశములను జెప్పి।
నిలువంబెట్టితినీకృపబ్రతికితి - నీధరలో నేయొప్పి॥మం॥ ౪౩॥
నినుబోలెడిపుణ్యాత్ములెందైన - ననునేజూడగలేదూ।
ఘనమగుయుపకారమునకు బ్రత్యుప-కృతియేమనినేజేతూ॥మం॥ ౪౪
విప్రవర్యమీపదపద్మములను - వేడ్కతోడభజియింతున్।
గొప్పజేసిమీయాశీర్వాదముల - కోరియొసగగదలంతున్॥మం॥ ౪౫॥

వ॥ అనియిట్లు రుక్మిణీదేవి తనకు విప్రుండొనర్చిన మేలునకు మనంబు నను బ్బుచు యాభూసురునసేక విధంబుల వినుతించి నమస్కరించినంగని యమ్మగువగౌరవంబునకు సంతసిల్లి భూసురుండనేక విధంబుల నాశీర్వదించి తనదునిజస్థానంబునకుంజనియె* నంత రామకృష్ణులు తనకూతువివాహంబునకు వచ్చుటవిని తూర్యఘోషంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబులం బూజించి మధుపర్కంబులిచ్చి* వివిధాంబరాభరణంబులు మొదలయిన కానుకలొసంగి భీష్మకుండు బంధుజనసేనాసమేతులైనవారలర సందూర్ణంబున సకలసంపత్పరిపూర్ణంబులయిన నివేశంబులుగల్పించి విడియించె నిట్లుకూడిన రాజులకెల్లను వయోవీర్యబలవిత్తంబులెట్లెట్ల కోరినపదార్థంబులెల్లనిప్పించి పూజించెనంత * విదర్భపురంబుప్రజలు హరిరాకవిని వచ్చిచూచి నేత్రాంజలులందరదీయకమలమధుపానంబు సేయుచు వర్ణించిరెట్లనినా॥ *

శ్రీ రుక్మిణీకల్యాణచరిత్రము - ప్రథమభాగము.

సమాప్తము.



    

శ్రీరస్తు.

# శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

## ద్వితీయభాగ ప్రారంభము.

### విదర్భపురాంగనలెల్లంగుమిగూడి శ్రీకృష్ణునివర్ణించుట.

కీర్తనము—కమాసురాగము - ఆదితాళము.

పల్లవి.

నీలమేఘశ్యాముండగునే    నీగ... లా రా। నీలమే॥

అనుపల్లవి.

బాలాగోపాలుడగును-

(దృత) శీలుడు శ్రీకరుడునుక్కరుణాలవాలుడగు శ్రీప...

చరణములు.

నీనిమోముజూడజూడగా    వేటలాగుచున్నది
చానలారకనుగొనరెబాగా
భానుకోటిసమతేజుడు    వేణుగానలోలుడగును

శ్రీనివాసుడగుదు వెలయు | చెన్నుగ బ్రహ్మేంద్రాదుల
కొలువ మరచినున్నాడదో | నీలమేఘ॥౧

తడయక నెన్నెన్నో విధములనో | మనతరుణి రుక్మిణి
కడుతపములొనర్చి గాంచెనో
పుడమిని యితనికి సరియగు | పురుషుని మన మెందైనను
బడగానగ లేదుగదరే | పడతికి వరుడాయనుమన
భాగ్యవశంబుగ తలపగ॥ | నీలమేఘ॥౨

సరసీరుహపత్రనేత్రుడే | శంకరవినుతుడు
కరినేలిన కనకాంబరుడే
ధరనుగ్గులెట్టురి వెలసిన దాసవరులదయ నేలిన వరమునడగునీతని మది
నిరతము భజియించిన మన | దురితములను దొలగించును॥ నీల

—:o:—

మ॥ తగునీ చక్రి విదర్భరాజసుతకుం తథ్యంబువై దర్భియుం। దగునీ చక్రికి నింతమంచిదగునే దాంపత్యమీయిద్దరిం। దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా దర్పాహంతారాతినై। మగడౌ గావుత చక్రి యీరమణికిన్ మావృణ్యమూలంబునన్॥ *

వ॥ అనియివ్విధంబున పురాంగనలెల్లం గుమిగూడిన ద్దేవుని వర్ణించిరాసమయంబున॥

శ్రీరుక్మిణీదేవి శివురాణికిం బూజలు సలుప నేతెంచుట.

క॥ కులముగల బాలుపద్ధతి విలసితమగు గౌరిపూజ వేటకగ జేయన్। బలురథగజతురగములును గలసేనలు గొలువ వెడలె కాంతరుక్మిణి॥

వ॥ ఇట్లు తమకులాచారధర్మంబున వివాహలగ్నంబునకు ప్రథమపక్షంబున శివురాణిం గొలుచుట కర్తవ్యంబని గావున * ననేకరథగజతురంగములం గూడి సకలదేశాధీశులుం జనుచుండ ఛత్ర చామరాలవట్టంబులం బట్టి యనేక సేనలుం గొలుచుచుండ * మహాశోభాయమానంబున రుక్మిణీదే

వినిందోడుకొని యానగరంబునకున్నేలువడి వెలసియుండు గౌరీమందిరంబున
కేతెంచి రిట్లనినా॥ *

కీర్తనము - హిందుస్తానికాపి రాగము - ఆదితాళము.

పల్లవి.

పూజసలుపవెడలెన్ - రుక్మిణి - పూజసలుపవెడలెన్॥

అనుపల్లవి.

పూజసలుపుటకు ప్రొలుపుమీరగను
రాజసంబుతో రమణులగూడియు పూజ॥

చరణములు.

వెలలేనినగలను - దాల్చియు - వలువబలుహొయలనుగట్టియు
జలతరుచెంగులు జారసరిగామొ
గ్గలనఖిగో టులరవికెదొడగి॥ పూజ॥౧॥

సన్నద్ధులగుచును - భటులును - శస్త్రధరులగుచును గొలువగ
పన్నుగనప్సర కన్నెలునాడగ
మిన్నుపికకూటిలు మేళరవములతో॥ పూజ॥౨॥

అతిపరాక్రములగుచు - సకలభూ-పతులువినుతిగనుచుపొంగుచు
పతితులగుచుతమ బలములతోడను
చతురతవెంబడి చనుచేరగవడి॥ పూజ॥౩॥

భూసురాంగనలును - నవ్యోడ-పుష్పగంధములను ధరించియు
భాసురంబుగను పాటలుబాడగ
నాశుభకన్యల నందములాడుచు॥ పూజ॥౪॥

నగుచుతనదుజన ని- గదలగ - మగువలుపచరములు సలుపగ
అగణితమద్దులే డనువురివెలసిన
ఖగపతిగమనుసు కాంతుడగుననుచు॥ పూజ॥౫॥

వ॥ మరియు సూతమాగధ వందిగాయక పాఠక జనులంతంత నభినందించుచు జగుదేర మందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునందలంచుచు నిందుధరసుందరీ మందిరంబుజేరిసలిలధౌతచరణకరారవిందయై వార్చిశుచియై గౌరీసమీపంబునకుంజనియెనంత ముత్తయిదువలగు భూసురోత్తములభార్యలు భవసహితయైన భవానికిమజ్జనంబుగావించిగంధాక్షతంబులిడి వస్త్రమాల్యాది భూషణంబులనలంకరించి ధూపదీపంబులొసంగి నానావిధోపహారంబులుసమర్పించి కానుకలిచ్చి దీపమాలికలనివాళించి రుక్మిణీ దేవి మ్రొక్కించిరప్పుడు॥ ❋

—:o:—

శ్రీరుక్మిణీదేవి గౌరీదేవిని ప్రార్థించుట,

—:o:—

ఉ॥ నమ్మితినామనంబున సనాతనులైన యుమామహేశులన్ । మిమ్ముబురాణదంపతుల మేలుభజింతుగదమ్మ మేటి। పెద్దమ్మదయాంబురాశివిగదమ్మ హరింబతి సేయుమమ్మ। నిన్నమ్మినవారికెన్నటికినాశములేదుగదమ్మయీశ్వరీ॥

—:o:—

కీర్తనము-కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

నమ్మితిపూబోణీ నన్నాదరించుజగన్నాథునిరాణీ॥నమ్మి

అనుపల్లవి.

నమ్మితివేటక నళినదళాక్షిరో
సమ్మతిమీరగ సకలసిరులొసగు॥ నమ్మి॥

చరణములు.

హిమాచలతనయ యుమామహేశ్వరి
కుమారజననినీ సమానమెవరిల॥ నమ్మితి॥౧॥

శరణుశరణని మొరలిడితినను
కరుణజూడుమిక పరమపావని॥ నమ్మి॥ ౨
ధరన్మద్దులే ట్పురనివాసవర
హరినిగోరితిని పరిణయముజేయు॥ నమ్మితి॥ ౩

మంగళహారతి బిలహరిరాగం- ఆదితాళం.

పల్లవి.

మంగళమని మంగళమని మంగళమనరె
మంగళమని పాడరే శుభాంగనలారా

అనుపల్లవి.

రంగుపచ్చెరములగొని రమణలెల్లగుమిగూడియు
పొంగుచుజగదీశ్వరియౌ పువ్వుబోణిగౌరికిజయ॥ మం

చరణములు.

మహిషాసురమర్దనికిని సహజానిమలగాత్రికి
అహిపతిభూషణుసతికిని ఆర్యాదాక్షాయణికినిజయ॥మం॥౧॥
హిమవంతునిప్రియసుతకును శమదమగుణధారిణికిని
కమలాశ్రితచండికకును కాళికినిమృడానికిజయ॥ మం॥౨॥
ధరనువెలయుమద్దులేట్పురి దాసవరులదయనేలిన
సరసీరుహదళనేత్రికి. శర్వాణిభవానికిజయ॥ మం॥ ౩

—:o:—

వ॥ అః గౌరీదేవికిమ్రొక్కి పతులతోడంగూడిన బ్రాహ్మణభార్యలకుల వర్ణాపూపంబులను తాంబూలకంఠసూత్రంబులను ఫలంబులనిక్షుఖండంబులను నిచ్చి రుక్మిణీదేవి వారలంబూజించిన॥ *

—:o:—

గీ॥ వారలుత్సహించి వలవొప్పదీవించి । శేసలిడిరియువతిశిరమునందుం
సేసలెల్ల దాల్చి శివవల్లభకు మ్రొక్కి-। మానని యతిమానిమగువ వెడలె॥

వ॥ యెట్లనిన॥ *

—:o:—

కీర్తనం—కమాసురాగం - ఆదితాళం.

పల్లవి.

వెడలివచ్చెను రుక్మిణీ శ్రీగౌరిమందిరము॥ వెడలివ॥

అనుపల్లవి.

కడువడినందెలు ఘల్లుఘల్లుమన
పడతివేగమున భాసురమొప్పగ॥ వెడలీ॥

చరణములు.

సంతసమొప్పగ - ఆసఖియయొప్పె మద - దంతియోయనగా
కంతునిబాణమొ కారుమెరుపొ చే
మంతిపూవుల బంతియొయింతియొ యనన॥ వెడ॥౧

వెన్నెలాసోగయో-కలహంసయొ-వన్నెబంగరుబొమ్మయొ
చెన్నుగమరునిరా చిలుకసాంబ్రాణియొ
కన్నువయోసుర కన్నెయోయనగ॥ వెడలీ॥౨

యీశానునిసతియో- యింద్రాణియో-రతియో భాసురసరస్వతియో
వాశిగనీధర శేషాదాసుని
దోషమడంచిన కేశవుసతియన॥ వెడలీ॥3

తోహరా॥ యివ్విధముగ శ్రీగౌరిమందిరము- వెడలెను రుక్మిణియపుడు ।
నవ్వనజాక్షియు మెరసె మేఘమున-నగపడు మెరువుయనంగదు॥ ౪౬
కదలివచ్చు కమలాక్షినిజూడగ - కాముబాణమనమొందీ।
యవరుసటులనా రాజులువ్రాలిరి - యాధర పైభ్రమజెంది॥ మం॥౪౭

వ॥ ఇట్లు మేఘమధ్యంబున వెలువడి విలసించు క్రొక్కారు మెరుంగు తెరంగునను మరియు ననేకవిధ ప్రభాభాసమానయై యిందుధర సుందరీ మందిరంబు వెడలి వీరమోహినియై చనుదెంచుచున్న సమయంబున నయ్యింతి దరహాసలజ్జావలోకనంబులం జిత్తంబులేమరి ధైర్యంబులుడిగ నాడి గాంభీర్యంబులువిడిచి గౌరవంబులు మరచి చేష్టలుమాని మొరుకలండిగి యాయుధంబు లుడిగవైచి గజతురగరథారోహణంబులు సేయనేరక రాజులెల్ల నేలకు వ్రాలిరా మేణీలోచన తనవామకరనఖంబుల నలకంబులుదలంగం ద్రోయుచు నుత్తరీయంబుజక్కనొత్తుచు గడకంటిచూపులం గ్రమంబున నారాజలోకంబు నాలోకింపుచు॥ *

.:౦:.

కీర్తనము— ముఖారిరాగము - రూపకతాళము.

పల్లవి.

కనిమెను రుక్మిణి - తన - కన్నులారా - శ్రీకృష్ణుని॥ కని॥

అనుపల్లవి.

మనమున లజ్జయు పెనగొనుచుండగ
మరి భయోత్సాహము ప్రేమ చెలంగను॥ కని॥

చరణములు.

శంఖచక్రధరుని పంకజనేత్రుని
చారుతరవక్షుని పరమదయాళుని॥ కని॥ ౧॥

అంబుజనాభుని తాంబరధారుని
యమృతరసభాషు - పీ దానవకులరిపు॥ కని॥ ౨॥

నీలమేఘశ్యాము పాలుకరుణాల
శ్రీలలనాలోలు - గో వాలుగుణశీలు॥ కని॥ ౩॥

శ్రీరమణీమణమై చెన్నొందుమద్దాలే
దూరుసవెలసిన మేరుపధీరుని॥ కని॥ ౪॥

-:o:-

శా॥ కనియెన్ రుక్మిణిచంద్రమండలముఖుం గంఠీరవేంద్రావలగ్ను। న
వాంభోజదళాక్షు జారుతరవక్షున్ మేఘసంకాశ దేహునగా। రాతిగజేంద్ర
హస్తనిభబాహుంజక్రి పీతాంబరున్ఘనభూషా। న్వితుగంబుకంఠునిజయో
త్కంఠున్ జగన్మోహనున్॥ ... ... ... ... ❊

వ॥ ఇవ్విధంబున రుక్మిణీదేవి శ్రీకృష్ణమూర్తినింజూచి తదీయరూపవ
యోలావణ్య వైభవగాంభీర్యచాతుర్యతేజో విశేషంబులకు సంతసించి మనో
భవశరాక్రాంతయై రథారోహణంబుగోరుచున్న వరారోహంగనుంగొని
నయ్యవసరంబున॥ ❊

శ్రీకృష్ణుండే తెంచి శతృరాజులుజూచుచుండ
రుక్మిణీదేవినింగొనిపోవుట.

కీర్తనం—బిలహరిరాగం - ఆదితాళం.

పల్లవి.

యరుగుదెంచెనుకృష్ణుడు జేటుర్మీర॥ యరుగు॥

అనుపల్లవి.

యరుగుదెంచెనుకృష్ణుడు యదుకులాంబుధిసోముడు
సరసిజాక్షుడుశంభువినుతుడు సకలగుణసంపన్నుడగుహరి॥ య॥

చరణము:లు.

మదినిసంతసమొప్పగ - భీష్మకరాజ సుతయారుక్మిణిజూడగ

సదయుడగుచుగజవరదుడా సన్నుతాంగినీకనులజూచుచు
హృదయమునదలపోసెనివ్విధి యువిదనిలనే నెరుగననుచును॥ య॥

వదనచిహ్నములెన్నగ-విభ్రపల్లుల- విధముసొబగగునుబాగా
సతముపదహార్వేలగోపిక సఖులమెలగితిగానినందొక
ముదితకైనసునీవిలాసము. వెదకిననులేదామెననుచును॥ య॥౭

ధరనుముద్దులేట్టురిని - దాసులనునే-దయనేలినశ్రీహరిని
సరగుననునీసభలనమమను చనినెలతగానసమునుగునివి
నిరతముగనీసుదతినేలిన నేర్పువడయుదుభూవిననుచువడి॥ య

—:o:—

తోహరా॥ అంతటశ్రీకృష్ణుండువచ్చుటయు-అతివమిగులజూచియును.
సంతసమందియుశిరమునువంచెను-సఖియశిగ్గుతోసుతను॥ మం॥ ౪౮
అందరురాజులుజూచుచునుండగ - యతివనుగొనిముదమునను।
పొందికగనుతనరథముననిడుకొని - పోవుచుండెనంతటను॥ మం॥ ౪౯
వెంబడిగాబలరాముడునడిచెను - యెదువులనంవరిచేరి।
సంభ్రమగనుచనుచుండిరినవలను - సరగునరాజులుమీరి॥ మం॥ ౫౦

—:o:—

వ॥. ఇవ్విధంబున యారుక్మిణీదేవి సౌందర్యాతిశయంబులంగని మనో
త్సాహుండగుచు పరిపంధిరాజలోకంబులు చూచుచుండ మందగమనంబున
గంధసింధురంబులీలంజనుదెంచి పేరవంబులనడిమిభాగంబు గొనిచను కంఠీ
రవంబుకైవడి * నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజక
న్యకందెచ్చి హరి తనరథంబుమీదనిడుకొని భూనభోంతరాళంబులునిండశం
ఖంబు బూరింపుచు బలభద్రుండును తోడునడువయాదవవాహినీపరివృతుం
డై ద్వారకానగరమార్గంబు బట్టిచనియె నంత * జరాసంధవశులైనరా
జులందరు హరిపరాక్రమంబువిని సహింపనోపక॥ *



## జరాసంధాదిరాజులెల్లగుములై శ్రీకృష్ణునిపైసమరంబునకేతెంచుట.



మ॥ ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్నచందంబునన్ । మన కీర్తుల్ గొనిబాలదోట్టూనుడు సున్నాదంబుతో గోపకుల్ । చనుదున్నారదె శౌర్యమున్నటికిమీ శస్త్రాస్త్రముల్ గాల్పనే । తనుమధ్యన్విడిపింపమేసినగరే ధాత్రీజనుల్ గ్రంతలన్॥ ... ... ... ... *



వ॥ ఘనమృగంబులై యొప్పంబడు సింహంబుల పరాక్రమంబులన్ హరిణమృగావళులాదిగాగల స్వల్పజంతువులల్పంబుగావించిన తెరంగున మన పరాక్రమంబులన్ గణింపక శ్రీకృష్ణుండు యాదవసేనలంగూడి రుక్మిణింగొనిపోవుచున్నవాడల్లదో నికన్నీశస్త్రాస్త్రంబులన్ దహింపనే యట్లుగాకం డ నయ్యాదవులంజయించి యమ్మగువన్విడిపింపలేనట్లైన నిప్పుడమింగలజనులెల్లం పకపకన్ నగియుం గేళిజేయకుందురే యనియొండొరులన్బురిగొల్పుకొని రోషంబులు హృదయంబులన్బెనగుదుండ నయ్యవసరంబున॥ *



కీర్తనము — ఆరభిరాగము - ఆదితాళము.

పల్లవి.

రాజవీరులరుగుదెంచిరి - జరాసంధాది - రాజవీరులరుగుదెంచిరి॥

అనుపల్లవి.

రాజవీరులరిగిరవుడు        రణసమేతులగుచును - బహు
(ద్రుత) తేజముమీరగ చెలగుచు        తీక్ష్ణమగుశరములగొని॥ రాజ॥

చరణములు.

యదువంశోత్తముడగు శ్రీ        పక్షిభీష్మకసుతగొనుటకు

మదికూర్మిరము చెలగగబహు
మదగజతురగములను మరి  రథసేనలగుమిగూడియు॥  రాజ।౧

అదొచూడుడి సంతసమున  మదిరాక్షినిగై కొనిచను
యను పుంగవునణచియునా
ముదితను చైద్యునకొసగియు  మోదముగాంచెదమనుచును॥ రా॥౨

వాసిగధరమద్దులేటి  పురీశుడగుచు వెలసియుతన
దాసుడైన శేషయ్యకు
దోషముబాపిన హరియని  లేశముదలచకదూరుదు॥  రాజ॥౩



తోహరా॥ యివ్విధముగ జరాసంధాదులు - యుద్ధమునకు వెడలిరిచూడా।
నివ్వీరులసైన్యంబులు గదలెను - నలుదిక్కులు చెదురాడా॥ మం॥ ౫౧
వనరుగనప్పుడు వారిజాక్షునీ - ప్రచ్ఛేదమనుచును వేగా।
అనలము పైకొనివచ్చు మిడుతవలె  ఆగ్రహంబుతో న్వడిగా॥ మం॥ ౫౨
మనమున సంతోషంబుప్పొంగుచు - మన్మధుతండ్రికి నెదిరి।
కనుబొమలు ముడిబడుచునుండగను - కడురోషముతో ననిరి॥ మం॥ ౫౩
నిలునిలు రాసికింత పౌరుషము - నెలతనుగొనిపోవగనుక్
పొలుపుగ పోరిజయింతువు రా రా - ఘువిబలవంతుడవై నక్॥ మం॥ ౫౪
లేని మెడలయిపుడ శిత్వరగనుయా - లేమనొసగి శరణనుము।
మానితముగమర్యాదవహించియు - మన్నించెదమిది నిజము॥ మం॥ ౫౫



వ॥ యివ్విధంబున జరాసంధాదుల నేకవిధంబుల పౌరుషంబులాడుచున స్త్రాణంబులు వహించి ధనురాది సాధనంబులు ధరియించి తమ తమ చతురంగబలంబులంగూడి యదువీరుల వెంటనంటందాకి నిలునిలుండని ధిక్కరించి పకకి యుక్కుమిగిలి మహీధరంబులమీద సలిలధారలు గురియుధారా

ధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసినయాదవసేనలంగల దండ నాథులు కోదండంబులెక్కిడి గుణంబులు మ్రోయించి నిలువంబడిరప్పుడు॥

—:o:—

క॥ అరిబలభటనాయకముల హరిబలములు గప్పబడిన నడరెడుభీకర।
హరిమధ్యసిగ్గుతోడను హరివదనముగా చెచకితహరిణేక్షణియై॥

వ॥ ఇట్లిరుబలంబులేకంబులయి గదిసినంగని భయభ్రాంతురాలగుచు రుక్మిణీదేవి సిగ్గుతోడంగూడి సాక్షాత్ భగవంతుండగు శ్రీకృష్ణునివదనంబునుం గనినంజూచి హరియిట్లనియె॥ *

—:o:—

కీర్తనము-సురటరాగము- ఆదితాళము.

రగడననుసరించినది.

పల్లవి.

పంకజముఖిచూడూ - యీకలహాము - పొంకముతో నేడూ॥

అనుపల్లవి.

యయుంకువగనసీ యయద్విషతులునను
శంకబెట్టకను చనుదెంచెదరదో॥ పంక॥

రగడచరణములు.

అంగచోళకేరళ - హాటబెంకణ - కళింగచేది - కర్నాటకబర్బర *
కుంతలద్రావిడ - కొంకణమాళవ - సంతసమవుపాం- చాలపుళిందయు*
మగధపాండ్యశా - ల్మలసౌరాష్ట్రయు - అగణితమగు - అయోధ్యఘువాం
ధ్రయు * వంగయవనమళ - యాళఘూర్జరి - శంగకుకాశ్మీర - రాజా
ధిప్రులున * అతిబలాఢ్యులగు - అసురజనములును - చతుర్తగలిగిన - సై

న్యముతోడను ॥*॥ రథతురంగములు - రణభేరులుమరి - మదగజంబులతి - ముదముననగదలగ * ఆలవట్టములు - అనువగుధ్వజములు - వేలసంఖ్యలను- వెలయుఛత్రములు * చామరములువిం - జామరంబులును - ప్రేమమీరగ ల - బిరుదులతోడను * కొమరుమిగులభట - కోటులుగొలువగ - రమణీయవాద్య - రవములంటేలగగ ॥*॥ పరిఘపట్టస - ప్రాసఖడ్గము - ద్గరత్రిశూలములు - గదాశక్తితో * మరకవచములు - మరియునుబాకులు - కరవాలమాది - గలనాయుధములు * వారుణాగ్నేయ - వాయువ్యబ్రహ్మ- పురగహైంద్రాస్త్రా - గరుడాస్త్రంబుల * రథములనిడుకొని - రంజిల్లుచుబహు - మదోన్మత్తులై - మరిమరిబలుకుచు * ధరనుమద్దులేడ్ - పురహరియనినను - మెరుగకవచ్చెదు - వీరులగనుమిదో * ప్రకటితముగనా - బాహుబలమునే - యిక త్రిలోకముల - కెరుకజేసెదను *॥ (పంకజముఖి)

—:·:—

వ॥ అనియిట్లు రుక్మిణీదేవిని హరియూరడించెనని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుడిట్లనియె॥ *

—:o:—

తోహరా॥అంతటబలరాముండును మొదలగు - యదువీరులుగూడి।
సంతసముగజరాసంధుని - సమూహముపైనబడి॥ మం॥ ४६

పరిపపరివిధములసమరము జేయుచు-పరిమార్చిరితమరివులా।
సురులునుదివమునజూచుచుండిరా-చోద్యములనుతమకనులా ॥ ४७

కరిసంఘంబులనడుమను వెలసెదు-కంఠీరవంబుపగిది।
సరసిజాక్షుడాశత్రురాజులను - చంపసాగెశక్తికొలది॥మం॥ ४८

మెచ్చవశముగాదాపరాక్రములయేరికైనధరామీశా।
విన్ననుతమగదుయిరుసమూహములు-కన్నులగనినతమాషా ॥ మం॥

రథగజతురగములను రాక్షసులను రట్టించియు మరినకటా।
ముందముంతోడ నృపతుల సేనల- నిర్మూలము జేయగనపుడా॥మం॥ ౬౦

రక్తమాంసఖండములు నిండగను- రాజబలము ధరబడగా।
రక్తిగ భూతపిశాచ బేతములు- రయమున దినుచుండెనుగా ॥ ౬౧

అప్పాణపరంపరలకు నిలువక - నాయదువీరులు చూడక।
తబ్బిబ్బులాడుచు పారిరి రాజులు- తమ ధైర్యములిడనాడక॥మం॥ ౬౨

చ॥ మగుడి చలించి పారుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో।
వగచుచు నాలిగోల్పడిన వానికి ప్రియంగడు వెచ్చనూర్పుచుం।
మొగమున దప్పి దేరద మముందట బొక్కుచునున్న చైద్యుతో।
బగతుర చేతిలో బడక ప్రాణముతోడు తనున్నవాడ వే॥ *

—:○:—

వ॥ ఇట్లనేకవిధంబుల యిరుబలంబులం దొకరొకరింగదిసి రణంబుసలుపుచున్నయెడ కొంతతడవునకు నయ్యాదవోత్తములచే విడువంబడు బాణాగ్నికణంబులకుం నిలువనోపక జరాసంధాది రాజవీరులెల్లం సమరంబును చాలించి తామేతెంచిన తెరువంబట్టి మరలిజనిచని కొంతదవ్వునకు నాయాసాచిత్తులయి నిలువంబడిరయ్యెడ నొక్కచోటునందనేకవిధంబుల వగచుచు తనమగువం గోలుపోయిన చందంబున చింతాక్రాంతుండై సొక్కియున్న శిశుపాలునింగని మగధదేశాధిపతియగు జరాసంధుండిట్లనియె॥ *

—:○:—

జరాసంధాది రాజులు శిశుపాలుని పరితాపంబు నివారించుట.

—:○:—

గీ॥ బ్రదుకవచ్చునొడల ప్రాణంబులుండిన బ్రదుకుగలిగనేని భార్యగలదు। బ్రతికితీవు భార్యపట్టు దైవమెరుంగు వగవవలదు చైద్యవలదువలదు॥

వ॥ ఓశిశుపాలా యీదేహంబున ప్రాణంబులుండినయెన్నిదినంబులనైనం బ్రదుకవచ్చును అట్లుబ్రతికినపిదప మెచ్చుటనైనంగని యొక్కపడతిని వివాహంబుజేసికొనవచ్చును దైవానుకూలంబేకాని యితరంబేమియులేదుగాన నీవేలవగచెదవని మరియునిట్లనియె॥ *



కీర్తనము—శ్యామారాగము - చాపుతాళము.

ఖండికలు.

వినుమయ్యాశిశుపాల వేగదెల్పెదనునీ
మనమునశోకమేలా-శిశుపాలానీ-మనమునశోకమేలా॥ విను॥

ఘనుడుశ్రీకృష్ణుడు కరుణావిధేయుడు
కనకాంబరధరుడు- శిశుపాలా- కనకాంబరధరుడు॥ విను॥

పన్నగదానవి పాలనుగ్రోలియా
చిన్నివయసునదునిమెను-శిశుపాలా చిన్నివయసునదునిమెను॥ విను॥

మూడవమాసమున ముదమునవాడుచు
మూఢశకటుణ్ణణచెను-శిశుపాలా-మూఢశకటుణ్ణణచెను॥ విను॥

యేడాదిబాలుడై మొగసితృణావర్తుని
మెడబట్టుకొనిగూల్చెను-శిశుపాలా-మెడబట్టుకొనిగూల్చెను॥ విను॥

ప్రకటితముగరోల బంధించమద్దుల
అకలంకమునగూల్చెనూ-శిశుపాలా-అకలంకముననగూల్చెనూ॥ విను॥

పశువులమేపుచు బకుడుమొదలగురా
క్షసులయమపురికనిచెను-శిశుపాలా-రాక్షసులయమపురికనిచెను॥ వి॥

జననినిబొంకించి చనియాకాళింగుని
ఘనమెల్లనుడిపెను-శిశుపాలా - ఘనమెల్లనుడిపెను॥ విను॥

శిలలయిందు్రుడుగురియ జేయగగనిగిరిని
చెలగి వే్రిలనునిల్పెను - శిశుపాలా - చెలగి వే్రిలనునిల్పెను॥ విను॥

పడియార్వేలగోప సుదతులనేలిన
మదనగోపాలుండగును - శిశుపాలా - మదనగోపాలుండగును॥ విను॥

యివిగాకకంసుని పదిమూడేండ్లకులోన
వధియించెనుబలమున - శిశుపాలా - వధియించెనుబలమున॥ విను॥

అతనినిగెల్వనీ క్షితిలోనసమధీరు
సతమువెదకినలేడుగా - శిశుపాలా - సతమువెదకినలేదుగా॥ విను॥

మనమెల్లరెంతటి ఘనముగలిగినట్టి
మనుజులమగుదుమోయి - శిశుపాలా - మనుజులమగుదుమోయి॥ విను॥

ప్రాణములుండిన పడతిదొరకకపోదు
మానహీనమువగచుట - శిశుపాలా - మానహీనమువగచుట॥ విను॥

సిరతముమనమేలు శాశ్వతులకనుచనుట
సరియగునుమదినెంచగ - శిశుపాలా - సరియగునుమదినెంచగ॥ విను॥

ధరనుమద్దులేటి పురినివెలయుదాస
వరదుడగును స్థిరముగ - శిశుపాలా - వరదుడగును స్థిరముగ॥ విను॥

—:o:—

వ॥ అనియిట్లు శ్రీకృష్ణుని వృత్తాంతం బెరింగించియు వెండియునతని కిట్లనియె॥ *

శ్లోకము॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణాపిసురైరపి
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుంనశక్యతే॥

వ॥ విష్ణువుచేతగాని ఈశ్వరునిచేతగాని బ్రహ్మచేతగాని యితరులైన దేవతులచేతగాని నొసటవ్రాయబడిన వ్రాత తుడిచివేయనలవిగాదు గాన యవమానినికై వగచుట సప్రయోజంబులని మరియునిట్లనియె॥

తోహరా॥ శ్రీమన్నారాయణుఁడౌకృష్ణుని - శిశుపాలుఁడ చెప్పెదను।
ప్రేమమీర నాయాదిలక్ష్మియగు - భామను తాఁగైకొనెను॥ మం॥ ౬౩

సలలితముగ మధురాపురంబుపై - సప్తావశమారులను।
బలములతో నేఁబోవఁగనీతఁడు - బలమునఁ జేసెను మరినన్ను॥ మం॥ ౬౪

కామపాలు చేకట్టుబడఁగనీ - కృష్ణుఁడు కరుణను విడఁజేసె।
క్రమ్మరసిరువదియూడక్షౌహిణి - కడుబలసైన్యములను చేసె॥ మం॥ ౬౫

పమనెనిమిదొతూరున నేవచ్చియు - పగతులనందరితరిమి।
విదితముగను నేవిజయముఁగొంటని - యిచ్చజేర్చినీ వినుమీ॥ మం॥ ౬౬

కాలము మంచిదిగను కృష్ణుని - గెలచెమనలనిప్పుడును
సెలునుసింమకుశోకంబులుమరి - నీకు చైద్యవిడుమనెను॥ మం॥ ౬౭

వ॥ అనిన్నయిట్లు జరాసంధుండు నతనియొద్ది రాజులును శిశుపాలునిపరితాపంబు నివారించి తమ తమ ధూములకుం జనిరి శిశుపాలుండు ననుచరసేనాసమేతుండై తననగరంబునకుం జనియె ॥ అంతరుక్మియనువాడు కృష్ణుండు రాక్షసవివాహంబున దనచెలియలిం గొనిపోవుటను సహింపక నేకాక్షౌహిణి బలంబులతోడ సమరసన్నాహంబున న్వెడలె నెట్లనిన॥

శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిం గొనిపోవు టెఱింగి
రుక్మియనువాడు సమరంబునకేతెంచుట.

కీర్తనము - కరహరప్రియ రాగము - రూపక తాళము.

పల్లవి.

రుక్మిఁడు వెడలెన్ బహు రూఢిమీరగాను వేగ॥ రుక్మిఁడు॥

## ఓం శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

### అనుపల్లవి.

నిక్కముగనునీలవర్ణ నుక్కణగించెదననుచును
(ద్రుత) గ్రక్కునరద మెక్కియుబహు నిక్కులు బ్రేలుచునువడిగ॥రుక్మ॥

### చరణములు.

సారధినప్పుడుక - బిలచియు - సరగునతోలుమురధమని
ధీరతతోడక ... ... ... ... ... *
ఘోరశరములనుబూనియు క్రూరముతోడను వేగమె
నీరజనేత్రుండనిమది నెంచకబహుదూషింపుదు॥రుక్మ॥౧॥

బల్లిదుడగునే - నాడిన - వంశముపదుగూరిరాజుల
కల్లజేసినీ ... ... ... ... ... *
గొల్లడునా చెల్లెలగొని యుల్లాసముమీరగాను
అల్లదొచనుటయుగనుమటు అతిత్వరచనవలెననుచును॥ రుక్మ॥౨

హరుడగుగాని - లేకను - సరసిజభవుడైననుమరి
నిరతముగాసి ... ... ... ... ... *
ధరమద్దులేద్పురివెలసిన దాసవరదుడగుగానీ
స్థిరముగనతనినినణచెద చెలువుమీరననిబలుకుచు॥ రుక్మ॥ 3

వ॥ అనియిట్లు నారుక్మిహరికొలంది నెరుంగక సారధినదలించిరధంబుగూడందోలించి గోపాలకవెన్నముచ్చ నిమిషమాత్రంబు నిలు నిలుమని తిరస్కరించి బలువింటనారిసంధించి మూడువాడి తూపులహరినినొప్పించియిట్లనియె॥ *

సీ॥ మాసరివాడవామా పాపగొనిపోవ యేపాటిగలవాడ వేదివంశ । మెందుజన్మించితివెక్కడ పెరిగితి వెయ్యదినడువడియెవ్వడెరుగు మానహీను

డవీవు మర్యాదలెరుగవు మాయగ్గై కొనికానిమలయరావు। నిజరూపము నశత్రునివహాంబుపైబోవు వశుధీశుడవుగావు। వావిలేదు కొమ్మనిమ్మునీవు గుణరహితుండవు విడువువిడువవేని విలయకాలశిఖిశిఖాసమాన శితశిలీముఖముల గర్వమెల్లగొండు కలహామందు॥ ... ... ... ... *

వ॥ వెండియునిట్లనియె॥

---

కీర్తనం — మెదుకులకాంభోదిరాగం - ఆదితాళం.

పల్లవి.

వాదేలనాయదుకు లాధమనీకు॥ వాదేల॥

అనుపల్లవి.

నీదుకులముమాలో భేదామైయుండగ
మాదయనొసగక మరియుమ్రిచ్చిలించి
నాదుసహోదరిని న్యాయమగొనిపోవ
సాధుజనులకిది సహజమేర-ఔర॥సాధూ॥ వాదే॥

యేవగనైనను యింతినొసగినన్ను
బోవ్రుమనుచుశరణు బొందితివేని
యీవసుధనుకొన్ని యేండ్లుబ్రతుకుదు లేక
నావల్లహతమాట నదితప్పదు ఔర॥ నావల్ల ॥వాదే॥

ధీరుడవైయున్న పారకనాకోర్క
వీరసమరమునకు శూరుడనిలుమర
ఘోరణిమద్దులే దూరవెలయుహరిగ
కోరిపలుకనేల గొల్ల వాడ-ఔర॥కోరిపలు॥వాదే

—:o:—

# శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

## ద్విపద.

అనియివ్విధంబున యారుక్మిడవగ-వినికృష్ణుడంతట వేటఁ-తోనగియు *
యొకఁ-బాణంబున విల్లునుద్రుంచి - గ్రక్కున యాతనిగర్వమువదలు * న
టులయారిట మేను నాటగ వేసి - పటుతరముగ నెనిమిది ఘోటకముల *
సారథి రెంటను సంహరించియును - కరమర్ధమూడింట ఘనపతాకమును *
తునియలు జేయగా తొడరి వేవేగ - కనిరుక్మ్యుఁడు రోషకలితుడైనంత * మరి
యొకఁ-విల్లందమాధవుడెంగి - గురుతుగా చూపట్టి కొట్టగదునిగ * వెండి
యునింకొకఁ- వేటఁ-గుధనువు - దండధనునివలె తడయక బట్టి * ఘనకలుశే
యనం తనుదురాత్మకుడు - కనులనిప్పులురాలక డు ఘోరమగుడు * పరిఘ
పట్టసశూల ప్రాసకరవాల - ము - ద్గరభిండివాలతోమ్మరత్రిశూలాది * గాక
లనాయుధంబులనెన్నిగొసిన - వేగమెనన్నిట విరిగనురికె * అంతటపా
రక అధీరుడగుచు - చెంతనుండెడుగద చేయిబట్టిలేచి * అవలమిపైకొని
యాగ్రహంబునను- వెనుకటిగతిగానకనువచ్చుమిదుత * విధమునకృష్ణునిరథ
ముపైనుమికి - పదపడిఖడ్గముల్ బలునాయుధముల * పొడిపొడిజేయనప్పు
రుషోత్తముండు - కడువడి రోషంబు కడలిరానంత * ఘనమగుఖడ్గంబుకర
మునబూని - మనమునతనినిదునుమగనిపుడు * ననువగునిదియనినడుచుచున్
న్నంత - కనిరుక్మిణీదేవికదలినే తెంచి * సదములమతితోడ సారసగర్భు-
మృదుపదములబట్టిముదితయిట్లనియె॥ *

—:o:—

వ॥ ఇవ్విధంబున రుక్మరుండు హరిచే సారథినిం సకలాయుధంబులం గోలుపోయి రథంబుదిగ్గిపారిపోకధీరుండగుచు తనకరంబుననొకఁ- ఖడ్గంబు బూనిదర్పానలంబుప్పొంబమిదుతచందంబున యాకృష్ణురథంబుపై ధుమికి ఖడ్గకవచంబులంచూర్ణంబుజేసిన సహింపక మెయుంగులుచెదర నడిదంబువెరికి జళిపించివానిశిరంబుదెగవ్రేయుదునని గమకించి నడుచుచున్నసడ్డంబువచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు పట్టుకొనియిట్లనియె॥ *

సహోదరుండగు - రుక్మినివధింపబోవు

శ్రీకృష్ణునితో రుక్మిణీదేవి చంపవలదని నుతించుట.

మత్తకోకిలకీర్తనము.

యమునాకల్యాణిరాగం - అటతాళం,

పల్లవి.

సన్నుతించెదాననుయో సారసాక్షుమనవివిను॥సన్ను॥

అనుపల్లవి.

(మ)(త)పన్నగపతిశయనదేవ పంకజసంభవనుతహరి॥ సన్ను॥

చరణములు.

నిన్నునీశ్వరదేవదేవుని నిర్ణయింపకలేకయో
సన్నుతామరకీర్తిశోభిత సర్వలోకశరణ్యమా
యన్నయీతడునేడుజేసె మహాపరాధమునీయెడన్
నన్నుమన్ననజేసికావుము నాధనాధదయానిధేహరి॥సన్ను॥ ౧

కల్లగాదనివిన్నవించుట గారువల్లభయీతేసిన్
బిల్లదుండెదగాచితేనియు భాగ్యవంతులమైతిమా
కల్లుడయ్యెమురుండుడీశ్వరు డంచుమోదితుత్రైనమా
తల్లిదండ్రులుపుత్రశోకము చొప్పచికదూదురీశ్వరా-హరి॥సన్ను॥

వ॥ ఓదేవా మిముంసాక్షాత్ పరబ్రంహ స్వరూపుండవని యెరుంగక మాయన్నయగు నితండు మహాపరాధంబు గావించెరగాబోలు నీసమయంబున నాయెడంగృపజేసి నితనిందునుమకరక్షింపుండని ప్రార్థించెద॥ అట్లుగాక నితనింబురికొల్పితిరేని సాక్షాత్ భగవంతుండగుహరియేమాకల్లుం

డావెునికంగొరత యేమనిసంతోషించుచుండెడి. మాతల్లిదండ్రులాసంతోషం బుమాని పుత్రశోకంబునంజిక్కుదురీశా॥ *

—:o:—

కీర్తనము—ఆహిరిరాగము - అటతాళము.

పల్లవి.

మనవినివినరాదా మానితగోవిందా-ముకుందా॥మన॥

అనుపల్లవి.

ఘనముగయదువంశంబున వినుతికెక్కినతిరుంపుడు
మనమలరగనన్నుగానిన కనకాంబర ధరణా-శ్రీరమణా॥ మన॥

చరణములు.

సన్నుతసుచరిత్రా సరసీరుహ నేత్రా-స్తుతిపాత్రా (స)
పన్నగపతి శయననాదు విన్నపమాలించియునను
మన్ననజేసియునికమా. యన్నను కరుణించు-మన్నించు॥ మన॥

సురమునిగణవినుతా సూరిజనపవిత్రా-శివమిత్రా (సుర)
హరియగుభగవంతుడుమా కల్లుడావెునని ముదమున
మరియుదుమాతలిదండ్రులు మోదమువిడిచెదరు చిక్కుదరు॥ మన॥

ధరవెలసినశేష దాసమనోల్లాసా-వికాసా (ధ)
పరమపురుష భవవినాశ పరమదయానిధేశ్రీకర
కరివరదవిధాత జనక గిరిధరకృపలేదా-శ్రిత మోదా॥మన॥ 3

మ॥ అనిడగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో । వినత శాంతముఖంబుతో శృతిచలద్వేణీకలాపంబుతో । గనుదోయింజడిగొన్న భాష్పమ్ములతోగన్యాలలామంబు । మొక్కిరుక్మిందెగద్రేయాలోకమగిడెక్ కృష్ణుండురొచ్చిష్ణుడై॥ ... ... ... ... *

వ॥ ఇట్లనేక ప్రకారంబుల శ్రద్ధాభక్తివినయంబుల రుక్మిణీదేవి నభ్భగవంతునింబ్రార్థింప యమ్మానిని మృదుమధురవచనంబులంగరుణించి నా దురాత్మకుండగు రుక్మినివధించుట మానిక్రోధంబువిడనాడెనంత॥ ❀

## శ్రీకృష్ణుండు రుక్మినివధించుటమాని యతనికినవమానంబు గావించుట.

తోహరా॥ ఇటులవధించక బావారంమని- వేళిమిగా బిలచియును।
పటుతరముగబంధించియునపుడు- బహునగవులనగచుచునూ॥ ౧౮

ఒకకత్తియుచేపట్టియుగొరిగెను - యొకచెంపనుగడ్డమును।
వకపార్శ్వముగనుతలయును- మాతియువక్రపరచివిడువగను॥ ౧౯

-:o:-

వ॥ ఇవ్విధంబున రుక్మిణీదేవి సహోదరుండగు రుక్మింజంపుటమాని యోబావారంమని చిరునగవునగుదుహాసింబట్టి బంధించి గడ్డంబును మీసంబు నుందలయును నొకకత్తివాతియమ్మున రేఖలువారంగొరిగివిరూపింజేసె॥ ❀

తోహరా॥ అంతటయదువులుపరసైన్యంబుల-యదరదోలివచ్చిరిగాన్।
నంతకృష్ణురథచెంతకట్టుబడి-నడలురుక్మిణునికనగాన్॥ మం॥ ౨౦

కదలివచ్చిబలభద్రుడునాతని - కట్లనువిడచియుమరియున్।
హరినిజూచియునుబలికెనునీకిది - యనువగునామదేమరయన్॥ ౨౧

-:o:-

వ॥ అంతట యదువీరులు పరసైన్యంబులంబారదోలి తత్సమీపంబున కువచ్చిరప్పుడు హతప్రాణుండై కట్టువడియున్నరుక్మింజూచికరుణజేసి బలభద్రుండు బంధంబువిడిచి హరిడగ్గరియిట్లనియె॥ ❀

బంధువుండగు రుక్మిని వధియించుటకుం దగదని

శ్రీకృష్ణునితో బలభద్రుండు బలుకుట.



క॥ తలమునకభీష్మ నందను తలయునుమూతియునుగొరుగదగవేబంధుం।
దలయునుమూతియుగొరుగుట దలదరుగుటకంటెతుచ్ఛతరముమహాత్మా॥ *



తంగం పాటవర్ణమెట్టు, కాపిరాగం-ఆటతాళంబాపు.

పల్లవి.

గోపాలకృష్ణా-గోపాలకృష్ణ గోవర్ధనధరణ-గోవర్ధనధరణ॥
శ్రీపతేమునిపాలన - వినుమా- గోపకులోద్ధారణ॥ గోపాల॥

చరణములు.

కంసమదహరణ-కంసమదహరణ కాంచనచేలన-కాంచనచేలన
అంచితమెరుగకనా - రుక్మణు - హింసించతగవగునా॥ గోపా॥౧

పంచశరుజనక-పంచశరుజనక బంధువుండనక-బంధువుండనక
మంచితములేకా - సరియే - నెంచిబంధించిగొరుగా॥గోపా॥౨

ధరమద్దులేట్పురి-ధరమద్దులేట్పురి దాసవరదహరి-దాసవరదహరి
కరుణజూడుమురహరీ-యతనిని- కమలనాభశౌరీ॥గోపాల॥ ౩



వ॥ ఇట్లుబలరాముండు రుక్మణుని భంగంబునకై తనసోదరుండగు కృష్ణునింగని యోకృష్ణా నియ్యది మంచి చెడుగనియోచించక భీష్మకరాజ తనయుండగు నీరుక్మి నీలాగునంబంధించి తలయును మూతియుంగొరుగుటకుం దగవగునే * మఱియునీలాగునతలయునుమూతియుంగొరుగుటయందునుం

తలం దెగవేయుటకంటెనుం మహాతుచ్ఛతరం బగుంగాన మీరలు సాక్షాత్ భగవతుండవయ్యును బంధువునీలాగున నవమానంబు జేయందగవేయని మరియు నిట్లనియె॥ *

-:o:-

క॥ కొందరురిపులనియలుగవు కొందరుహితులనుచు మేలుకూర్పవనిజ మీ। వందరియందును సముడవు పొందుగ నేలట్ట్యావిషమబుద్ధినసంతా॥ *

—:o:—

వ॥ ఓకృష్ణా కొందరుశత్రువులనికోపముసాయకనున్న మఱికొందరు స్నేహితులని మేలొనర్పకనున్న అందరియందును సమానుడవై యుండు నట్టిమీకీరుక్మిం కోపించుట కారణం బేమని యనేకవిధంబులం బలికి తదనంతరమున॥ *

—:o:—

సహోదరుభంగంబునకై దుఃఖించుచున్న రుక్మిణీదేవింగని బలరాముండూరార్చుట.

తోహారా॥ అన్నగురుక్మణుయవమతికోర్చక-యడలురుక్మిణికినని యెక్।
యెన్నగానుముక్ చేసుకున్నమీ-యన్నపూజఫలమనియెక్॥ మం॥ ౭౨
సారసాత్ముడగు వేంకటవిఠలుని-సన్నిధినవమతిపడగాక్।
చేర్చివాని సెయాశారదపెనిమిటి-చెలియవగవవలదింకక్॥ మం॥ ౭౩
పూర్వకర్మఫలమనుభవింపకను-బ్రహ్మారుద్రులకున్నైనక్।
నీరజాక్షితప్పింపగవశమె - నీధరలోనెందైనక్॥ మంగ॥ ౭౪
అయినసిధ్భువినిదండించియుమరి ఆదరించువాగర్పలరే।
నెయ్యముమీరగనెంచగనతనికి-నేటికికర్మిడేరే॥ మంగ॥ ౭౫
బ్రహ్మచేతకల్పితమైయుండును - ప్రబలంబగుదోషమునక్।
నిర్మలమునుచారనీకసహోదరి-నైననువధియింపగనుక్॥ మం॥ ౭౬

సారసాక్షినిటులుండగనీకును-సారెకుశోకమూలేలా।
పరపురుషడగుశ్రీహరియితడగు-భావింపుముమదిచాలా॥మం॥ ౭౭

వ॥ అనిమరియునిట్లనియె॥ ✻

కీర్తనం—హిందుస్తానికమాస్ రాగం - ఆదితాళం.

పల్లవి.

మేలగునాచెలి మేదినివగచుట
బాలరోనీసరీ బాలికలకునిటు॥ మేల

అనుపల్లవి.

చాలుచాలువై వేలగునీపతి
బాలకృష్ణుడే ప్రబలెనుశ్రీహరి
వాలాయముగను వనజనేత్రివిను
జాలముమాయక సన్నుతిసేయుము॥ మేల॥౧

చరణములు.

శ్రీసాక్షాత్ హరి జేసినదెల్లను
నీసహోదరుని దోషములరిగెను
శ్రీశుడనగనతని చెలువుగనెన్నుము
లేశమయినమది క్లేశమునెంచకు॥ మేల॥౨

యెంతటివారికి యిందుముఖిరో-నీ
కంతుజనకుడే కాంతుడగుటకును
సంతసముగునిది సామజయానరో
చింతలమానుము శ్రీలలనామణి॥ మేల॥౩

ధరనువెలయుశ్రీ కరమద్దులేట్పురి
హరియుగుణకీర్తిని స్మరియింపుము-మరి

సరసిజభవముఖ సన్నుతాంగుడౌ
కరివరదుడునిను కరుణనుబ్రోచును॥ పే॥౪

వ॥ మరియును॥

—:o:—

క॥ అజ్ఞానజమగుశోకము । విజ్ఞానవిలోకనమునవిడువుమునీకం । బ్ర
జ్ఞావతికిందగునే । అజ్ఞానులభంగివగువనంభోజముఖీ॥ ... ... *

—:o:—

వ॥ అజ్ఞానముతో సమంధించిన శోకాన్ని విజ్ఞానంబనెడు జ్ఞానాన్నవ
లంబించి విడిచిపెట్టుము అజ్ఞానులవలె దుఃఖించుటకుందెలివిమంతురాలవైన ఆదిలక్ష్మియగునీకుందగునేయని యిట్లుబలభద్రునిచే దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబుమానియుండేనట రుక్మియనువాడు ప్రాణావశిష్టుండై విడువంబడి తనవిరూపభావంబునకునెరియుచు హరింగెల్చికాని కుండినపురంబుచొరనని ప్రతిజ్ఞజేసి తత్సమీపంబుననుండె నివ్విధంబున॥ *

—:o:—

క॥ రాజీవలోచనుడుహరి రాజసమూహములగెల్చి రాజసమొప్పన్।
రాజితయగుతనపురికిని రాజాననదెచ్చె బంధురాజినుతింపన్॥ ... *

వ॥ అయ్యవసరంబున॥

—:o:—

—(శ్రీకృష్ణుని వివాహంబునకై ద్వారకానగరంబునందలంకరించుట.)—

కీర్తనము - కల్యాణిరాగము - ఆదితాళం.

పల్లవి.

శృంగారముజేసిరి ద్వారకపురము॥శృంగారము.

## అనుపల్లవి.

శృంగారముగాను సుదతులందరుగూడి
బంగారుమయముగ పంకజాక్షునిపురము॥శృంగా॥

## చరణములు.

మాణిక్యతోరణములను-పురవీధుల-ప్రాణకాపుదురనగను
ఆణిముత్యములను అందందు జేర్చియు
చానలద్భుతముగ సరగునగట్టియు॥ శృంగార॥౧॥

చొక్కమౌ ముత్యములను-ముగ్గులదీర్చి-మక్కువమీరగను
గ్రక్కునపన్నీరు గంధముత్తరులను
చక్కగగోడల సరమిచేటమీర॥ శృంగా॥ ౨

హెచ్చైనగోపురముల-దేవాలయ-రచ్చలుగల స్థలముల
రత్నకుందువెలయు రమ్యపు తేరులను
మెచ్చునటులబహు సచ్చరితంబుగ॥ శృంగా॥ 3

మరియుస్త్రీపురుషులకట- ఆనంద-భరితమనసులగుట
సరిగెవస్త్రములను సకలభూషణముల
పరిపరివిధముల పరిమళాదులనెల్ల॥ శృంగా॥౪

సలవపందిళ్లాదిగా-వేయించిరి-పలుతెరగులనుబాగా
యిలనుమద్దులేదు వెలయుగోపాలునకు
సలలితముగపెండ్లి జరుగుననుచుమిగుల॥శృంగా॥౫

—:o:—

వ॥ ఇట్లనేకవిధంబుల నయ్యాదవేంద్రునినగరంబు శోభాయమానంబై
తెమొప్పె నయ్యావసరంబున॥

## ——() శ్రీకృష్ణుండు రుక్మిణీదేవినిం బెండ్లియాడుట. ()——

—:o:—

మ॥ ధృవకీర్తికి హారి పెండ్లియాడె నిజచేతోహారిణికి మానవైభవగాంభీర్య విహారిణికి నిఖిలసంపత్కారిణికి సాధుబాంధవసత్కారిణి బుణ్యచారిణిమహాదారిద్ర్యసంహారిణికి సువిధూషాంబరధారిణికి గుణవతీచూడామణికి రుక్మిణికి॥ *

ఇది కవి పెదతండ్రిచే జేయబడిన పెండ్లిపాట.

కీర్తనము—ముఖారిరాగము.ఆదితాళము.

పల్లవి.

ఆనందమానందమాయనే - మన - కృష్ణుడు పెండ్లికొడుకాయనే
మన - రుక్మిణీ - పెండ్లికూతూరాయనే-   నేడు

అనుపల్లవి.

ఆనందసుతుని పెండ్లి - సానందముగ వినుడి॥   ఆనంద॥

చరణములు.

రాజీవలోచనుడు వేగను - సకల - రాజసమూహముల గెల్చెను
భీష్మ - రాజాకుమార్తెను దెచ్చెను - యెంతో - రాజసమొప్పబంధు
రాజీనుతింపగా॥   ఆనంద॥౧

పురముశృంగారము.శాయను-స్వామిపరివారములనప్పుడు బంపెను
వారు - వరుసతో యిండ్లవాకిళ్లను   శుభ
కరమొప్ప వేడుకలు - స్థిరముగ జేసిరప్పుడు॥   ఆనంద॥౨

# శ్రీ రుక్మిణీ కల్యాణ సంకీర్తనలు.

చెప్పన్న దేశములవారును-శ్రీ-యదుపతి పెండ్లివార్తవినియును
చాల - గొప్పైనకానుకలు గొనుచును మిగుల
ఒప్పైనద్వారవతికి అప్పుడెవచ్చినారు॥ ఆనంద॥౩

అండజగమనునిచూడను - సకల - మండలాధిపులెల్ల వేడ్కను
వే - దండహయరథములతో రాగను వారికి
దండిగవిడుదుల-నా ఖండలానుతుడుజూపె॥ ఆనం॥౪

సుందరాంగులు పాటలుపాడగ-బ్రహ్మానందముతోనప్సరులాడగ
దేవ - బృందములుపువ్వులుగురియగ మన
కందర్పజనకుడైన యిందిరేశునిపెండ్లి॥ ఆనంద॥౫

శృంగారవతియైనరుక్మిణీ - పు - ణ్యాంగనమణులుగొలువగను
మణి - తనచెంగటనున్నసంపత్కారిణి మెడను
మంగళసూత్రము పొంగుచుగట్టెనుకృష్ణుడు॥ ఆనంద॥౬

తీర్థైనముత్యములు చేపట్టిరి-యిరువురు- ఖ్యాతిగతలంబ్రాలుబోసిరి
సతి - పతులేకముగగూర్చుండిరి కృష్ణుడు
ప్రీతిమీరగను ఆ నాతిచేపట్టినాడు॥ ఆనంద॥౭

ధరలోనమద్దులేటి - పురమున శ్రీహరి: అరమరలేకను వెలసినా
డనుచు- స్థిరముగ తన్నుమదిలో నమ్మిన భక్తుల
కరుణించి బ్రోచినట్టి పరమపురుషునిపెండ్లి॥ ఆనంద॥౮

—:o:-

వ॥ ఇవ్విధంబున శ్రీకృష్ణుండపరిమితోత్సాహంబున భీష్మకరాజ పుత్రిక. యౌ రుక్మిణీదేవినివివాహంబుజేసికొనియె నయ్యవసరంబ॥ *

క॥ హరిపెండ్లికి గైకేయక కురుసృంజయయదువిదర్భకుంతి నరేంద్రు
ల్ । పరమానందముబొందిరి ధరణీశులలోనగాఢతాత్పర్యములన్॥

.:o:-

గీ॥ అనఘయాదిలక్ష్మియైనరుక్మిణితోడ గ్రీడసలుపుచున్నకృష్ణుజూచి। పట్టణంబులోని ప్రజలుల్లసిల్లిరి ప్రీతులగుచును కృతార్థులగుచు॥ ... *

వ॥ అని చెప్పి మరియునిట్లనియె॥ *

తోహరా॥యీచరిత్రమును ధరనెవరేనియు-వినినపఠించినమిగులా।
వాసిగగలుగుయిహపరసుఖంబులును-శ్రీశునికరుణనృపాలా॥ మం॥
మంగళమగుశ్రీ రుక్మిణీపరిణయ-మనునీచరితముభువిలోన।
పొంగుచువినువారికెల్లప్పుడు-పొలుపగుశ్రీహరిపురిలోన॥

—:೦:—

వ॥ అనియిట్లుపరీక్షిన్నరేంద్రునకు యిప్పుణ్యచారిత్రంబగు శ్రీరుక్మిణీకల్యాణమును శుకయోగీంద్రుండు వినుపించెంగాన యిట్టిభగవత్కథ నెవ్వరేనియు శ్రద్ధాభక్తితోడ వినినంబఠించినను వారులకు వినుపించినను నీయిహమందు పుత్రులంబడసి యనేక సౌఖ్యంబులంబొంది యావలనాపరీక్షిన్నరేంద్రుని పగిదియె మోక్షాన కర్హులగుదురని తాత్పర్యము॥ *

---

శ్రీరుక్మిణీసమేత గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.

మంగళము యమన్ రాగము - త్రిపుటతాళము.

పల్లవి.

వెంకటేశమంగళం విజయఘోషమంగళం॥ వెం॥

అనుపల్లవి.

పంకజభవనుతమురహరి పరమపురుషభక్తపోష
శంకరహిత సరసిజాక్ష సామజవరదాశ్రీహరి॥ వెంక॥

చరణములు.

నారదపూజితరఘువర నారాయణయఖిలేశ్వర
సారదయాకరభవహర సనకసమునివరపాలన॥ వెం॥౧

